తే. యఖిలజీవేశ్వరుఁడవైన యయ్యిందులకును, వనచరులచేతఁ దగుపనుల్ గొను టెసాక్షి
యట్టివి కేమి దీవింప నీప్రతాప, మీయశముఁ గల్గె ననుమాట కేమి సాక్షి.

క. ఐన నిజాశ్రితపక్షము, చే నానతి యిచ్చితిరి విశిష్టుల మనుచున్
మీనామము జపియింపం,గా నె కద ప్రతిష్ఠ మాకుఁ గలిగె జగములన్. 101

సీ. ఖలశిక్ష సాధురక్షయు నొనర్చనె కదా గురునాజ్ఞ నని నీవు దిరుగు టెల్లఁ
బగతు ఖండింప నేపంబు గల్గనె కదా పతి నొంటి యిడి వేఁట సనుటయెల్ల
గాండీవిఁ బోరి మఱలఁ జూపనె కదా భానునందనునిఁ జేపట్టు టెల్ల
నేకాంతభక్తుఁ డౌ టెఱిఁగి యేలనె కదా హనుమను నెనుంగరం బనుపు టెల్ల

తే. గణన సేయక దశకంఠుఁ దృణముగాఁ ద, లంచియె కదా విభీషణు లంక కధి
కట్టకయ మున్న పట్టంబు గట్టు టెల్ల, రవిసహస్రమహస్సాంద్ర రామచంద్ర.

సీ కులకర్త నింతి మీగురు నంపి మాన్పనాయకుభంగమని గంగ యమునకనియెఁ
దనతోడఁబుట్టు విం్ద్రుని కగ్గమాయెఁ గా యని గౌరి పతిమొగం బట్టె చూచె
మామ నీగతిఁ గలంపఁగ నాయమే యంచుఁ బరవాసుదేవుతోఁ బద్మవలికె
దిరుగ నబ్ధులతోడఁ ద్రిభువనంబు లొనర్పవలయునో యని వాణి వరుని నడిగెఁ

తే. దనహాయంబులకెల్ల జీవనములిచ్చు, నప్రభుఁడు నొచ్చునో యంచు నడలెవ్రి
బాడబజ్వాలలట్లు నీపటుశరములు, వార్ధి నింకించునప్పు డిక్ష్వాకుతిలక. 103

చ. కరమున నీవు విల్లుగొని కాండముఁ బూనిన మూఁడులోకముల్
కరము భయంబు నొందుఁ గడఁకన్ నిను మార్కొన నెవ్వఁ డోపు భీ
కరముఖనిర్గతాననశిఖాపరిదగ్ధసుదుర్వ రావణున్
దురమున బంధుయుక్తముగఁ ద్రుంపఁగ నీకె తగున్ రఘూద్వహా. 104

సీ. అమితాస్త్రశస్త్రప్రహస్తుఁడైన ప్రహస్తుఁ డురుమహోదరుఁ డమ్మహోదరుండు
చండయుద్ధాకంపనుం డకంపనుఁడు దేవాంతకుం డైన దేవాంతకుండు
కువచోనిగుంభుండు కుంభుం డుదితశత్రు దానికుంభుండు నాఁ దగునికుంభుఁ
డహిత విరూపాక్షుఁ డగువిరూపాక్షుండు యతియజ్ఞకోపుఁడౌ యజ్ఞకోపుఁ

తే, డాదిగాఁ గలదైతేయు లడఁగి రుగ్ర, సంగరంబున నీయోధసమితిఁ దోడరి
కడకఁ నతికాయుఁ డగునతికాయుఁ డీల్గె, నీసహోదరుచేః సీతాసమేత. 105

మ, ప్రళయాబ్ధప్రతిమాప్రమాణతనుశుంభత్కుంభకర్ణాద్రి నీ
కులిశాత్యుగ్రసుశాతబాణహతులం గూలెన్ దసగ్రీవదో
ర్బల మైవిన్ సహియింప డచ్చు సహియింపం గూడునే యింద్రజి
ద్బల మువ్వీరుఁడు చచ్చె నీకు హితమాపాదించు సౌమిత్రిచేన్. 106

మ సురకన్యాకబరీప్రగ్రహణజాశుభాప్రకీర్తిచ్ఛటా
భరసంసూచకవర్ణు రావణసుతున్ భంజించు టింద్రాదిభీ

కరపౌలస్త్యముఖాసురప్రవరులన్ ఖండించు కార్యంబులో
సరి యీ నందునఁ గాదె నిర్భయత మించం గల్గె జేజేలకున్. 107

క. జేజే యని జగ మెంచఁగ, జేజేలకు నభయ మొసఁగి చెలఁగితివి బళీ
యాజేతు వీరుఁడై తే, యాజేయజయాప్తి నలకు మని యగ్గింపన్. 108

క. ఆరాముఁడు, బుధవిభాగచ, యా రాముఁడు వెఱఁగు నొంది యంజలియుతుఁడై
వారలఁ గని గగనధునీ, వారలఘురఘుమఘుమూరవంబునఁ బలికెన్. 109

సీ. ఘటకర్ణకంపనాకంపనాదుల మాని యింద్రజిత్తుప్రతాప మెంచ నేల
ధూమ్రాక్షయూపాక్షదుర్ముఖాదుల మాని యింద్రజిత్తుప్రతాప మెంచ నేల
యతికాయవికటప్రహస్తాదులను మాని యింద్రజిత్తుప్రతాప మెంచ నేల
త్రిశిరోనరాంతకత్రిదశాంతకుల మాని యింద్రజిత్తుప్రతాప మెంచ నేల

తే. వారికంటెను మీఁ డంత వీరుఁడైన, కారణం బేమి జన్మప్రకార మెట్టు
లెవ్వరివరంబుచే నిర్జరేంద్రు గెలిచె, నెటులుఁ దన తండ్రికంటెఁ దానెక్కుడయ్యె

శ్రీరాముఁడు మునులను రావణజననాదివృత్తాంతముల నడుగుట

ఉ. తాదృశవిక్రమాన్వితసుతప్రభవంబున కాదికారణం
బాదశకంఠుజన్మము తదన్వయపద్ధతి తత్తపోమహ
త్త్వాదులు తత్త్రిలోకవిజయంబును మున్నగుచర్యలెల్లఁ బు
ణ్యోదయులార గోప్యదశనొందిన డాఁపక యానతీయరే. 111

చ. పరులకు డాఁచుపోలికఁ బ్రపన్నులకున్ మిమువంటి తెల్విచూ
పఱు లగు పెద్ద లంచితకృపారతి నెంతరహస్యమైన డాఁ
పరు లలితాత్ములార యని పల్కెడు రామునిఁ జూచి తత్తపః
పరులయనుజ్ఞఁ గుంభజుఁడు పల్కె నదంభవచోనిగుంభనన్. 112

అగస్త్యుఁడు రావణునివృత్తాంతముం జెప్ప నారంభించుట

ఉ. వారిజబంధువంశవరవారిధిచంద్ర దశాననాదిదే
వారిజనుస్తపోబలజయస్ఫురణంబులు విస్తరించెదన్
సారవభృంగఝంకరణసంగతరంగరవంబులీల నా
సారవచోవిజృంభణలు సారె వినం దగు నంచు నిట్లనున్. 113

పులస్త్యబ్రహ్మవృత్తాంతము

చ. పదములు నాల్గు గల్గి కవిపద్యముకైవడిఁ జెరిదు ధర్మ మెం
దని కృత మయ్యుగంబునఁ దదంచతధర్మగుఁడై పులస్త్యుఁ డన్
మొదలిటివేల్పుఁబట్టి ముమ్ముఖ్యులకున్ గమికాఁడు జ్ఞానశం
పదలబిడారు శాంతుఁడు కృపానిధి యొప్పు నహఃపతిప్రభన్. 114

క. శ్రీమించు సత్య మెలసి పి, దామహునకు సాటియై యశంశితకరుణా
సామగ్రిసత్త్వయుక్తిఁబి, తామహునకు సాటి యన నతఁడు విలసిల్లున్. 116

సీ. అకలంకసుగుణమహాసక్తికజన్మదేశమై యేమహానిహృదయాబ్జ మింపు గులుకుఁ
త్రిభువనవిమలవారిజవనీహంసి యై యేతపోధనుకీర్తి యెమ్మెగాంచు
నజమనఃకమలహర్షాపాది యై యేమహర్షి మహాతపం బతిశయిల్లు
సకలమానివతంసులకు మేలుబంతియై యేపుణ్యుదినచర్య యెప్పుఁ జెందు
తే. వినత దేవకిరీటభావితసరోజ
రాగరుచిచక్రవక్రచంక్రమణగతుల
నేమునిపదాంబుజములు లొప్పు నామహాత్ముఁ
డతఁడు సాధారణుఁడె పులస్త్యాహ్వయుఁడు. 116

ఉ. ఆమునిచక్రవర్తి దనయంచితదైర్యముపోల్కి మించు నా
హైమనగంబుచెంతఁ జెలువౌతృణబిందునియాశ్రమంబునం
దామస ముజ్జగించి వనితావిముఖత్వముఁ గాంచి క్రోధముతోఁ
గాము జయించి నూత్నశివుకై వడి నుగ్రతపంబు సేయఁగన్. 117

సీ. వలరాజుకోసమై యలవసంతుఁడు గూర్పుసేసినచిలుక తేజీ లనంగ
వనరాశి నావరించినకరంజక మేఘతతి మించుచంచలాలత లనంగ
భువనముల్ భ్రమియించి పూవిల్తు నెలయింప రతి దాల్చురూపాంతరంబులనఁగ
మునిచిత్తముల నొంప మనసిజుం డపు డంపవచ్చుమంత్రాదిదేవత లనంగ
తే. బెళుకుఁజూపులు నొయ్యార మొలుకునడలుఁ
దళుకుఁదోడలును సిబ్బెంపుఁగులుకుగుబ్బ
లమరునమరాహిఖచరకన్యలు సఖీస
మాజములతోఁ బులస్త్యాశ్రమంబుఁ జేరి. 118

సీ. పాటఁ బాడుదు రొక్కచోట, మోటులు పల్లవించి కోయిలలకు విందు సేయ
నాటలాడుదు రొక్కచోటఁ గాంచిఘంటికలు మ్రోయుమరుమదావళములనఁగ
మాటలాడుదు రొక్కచోటఁ జక్కెరవింటిజాణ తేజికిఁ దియ్యఖాణ మొసఁగ
నీటు సేయుదు రొక్కచోటఁ గేళిని మనోహరుఁ డేడ వలచునో యని చలింప
తే. నగుదు రొకచోటఁ గుముదసంతతులు విరియ
నిలుతు రొకచోట మెట్టతమ్ములు జనింప
ఖచరగంధర్వకిన్నరాంగనలు మీఱి
బ్రహ్మకొడుకు తపోవనాభ్యంతరమున. 119

సీ. గణిక సోఁకఁ గురంటకము కంటకమిషంబునను గగుర్పాటొందె వనిత చూడు
సరస మాధవి సేర విరితేనెనెపముతోఁ జెమరించె సురపొన్న చెలియ చూడు
లతకూన గదియఁ బల్లవదంభమున రసాలము రక్తిఁ గనిపించె రమణి చూడు
తనజాతికొమ్మ చెందిన మరుద్గతి బంధుజీవంబు వడఁకె నెచ్చెలువ చూడు

తే. మల్లికాయోగ మంది సంపఁగి సువర్ణ
పుష్పములు పెక్కు మొనయించెఁ బొలఁతి చూడు
మనుచు సకలర్తుశోభితం బైన మునిత
పోవనంబున మెలఁగి రప్పువ్వుఁబోండ్లు. 120

చ. ఇటువలె జవ్వనంపుమద మెచ్చఁగ నెచ్చెలు లిచ్చ మెచ్చఁగా
నటు నిటుఁ జెంత వారు చెవలాడఁగఁ గందువమాట లాడఁగాఁ
జటిపోటిగుబ్బచేల లిలఁ జీఱఁగఁ బల్కుఁ జేరఁ జీరఁగా
జటి జపవిఘ్న మోరువఁగఁ జాలక చాలఁ గఱంగి యిట్లనున్. 121

శా. ఓ లీలావతులార నేఁడు మొద లేయొయ్యారి వీక్షించు న
న్నాలోలేక్షణ యాక్షణంబున సకన్యాత్వంబు దూష్యంబు గాఁ
జూలాలౌ ననుచున్ శపింప మునిరాజుం జూడ శంకించి యిం
దేలా మాటలు సాలుఁ జాలు నిఁక రారే యంచు వారేగుచున్. 122

సీ. మగతావిచికిలికమ్మలు డాయుఁ దెలుపెక్కఁ జెక్కులే మని యోర్తు చెలియ నడిగె
నీలకాంచీచ్ఛాయ నెరయ నీనూఁగారు మెఱసె నేమని యోర్తు మెలఁత నడిగెఁ
గస్తూరి గరఁగి పైఁ గ్రమ్మ నేటిదె చూచుకములు నల్లని యోర్తు కాంత నడిగె
నళుకుచేఁ బరుగెత్తి యలసి రానేమొ యాయలసత్వ మని యోర్తు కలికి నడిగె
తే. దారి నడచుడు నలజడ దారికినుక
దారితోత్సాహ లై తప్పి తాపి యతనిఁ
జూచితిమె యంచుఁ జూలాండ్ర సొబగు లెంచి
భ్రమసి యొండొరు నడుగుచుఁ బడఁతు లరుగ. 123

వ. అంత. 124

ఉ. బిందునిరోధమందుఁ దృణబిందుకి నందిని తత్తపోవనం
బిందునిభాననంబు గలయిష్టసఖీమణితోడఁ జేరి యం
దంద చరించుచుండె భయ మన్న దొకింతయు లేక మానసం
క్రందనుఁ డప్పు డాడిన తెఱంగది విన్నది గాదు గావునన్. 125

వ. ఇవ్విధంబున. 126

సీ. తనతనూసురభిళత్వము ఘుమ్మమనఁ గ్రమ్ముకొన గంధవహభావ మనిలుఁ డొందఁ
దనకాంతిలత లల్లుకొన పనీతరు లెల్లఁ గనకసాలశ్రీలఁ గని వెలుంగఁ
దనమందహాసకుందములకై విరియునారిని గూర్పు మరుఁడు సారెకును దిరుగఁ
దనకరారుణరుచుల్ ఘనలతాములఁ దారసిలి నవ్యకిసలయావళుల నింపఁ
తే. దనపలుకు చిల్కపలుకుతోఁ ద్రస్తరింపఁ, దననడలు నెమ్మికొమ్మలఁ దప్పవట్టఁ
దననఖాంశువు లిలకు గంపంబు పూయ, రాజఋషిపుత్త్రి వనవిహారంబు సలిపె.

వ. ఇవ్విధంబున నవ్వనంబులోన నజ్జవ్వని విహరించు దవతోడిముద్దులాడిం
బొడగానక యవ్వాలుఁగంటి యెటువోయెనో యని యొంటిగా నవ్వలం జనిచని,

### పులస్త్యదర్శనముచేఁ దృణబిందునిపుత్త్రి గర్భిణి యగుట

మ. కనకాంగీమణి కంచుగీచివగతిం గంఠంబు మీఱన్ జటాం
తనిరూఢశ్రుతిపాఠ మొందినపులస్త్యబ్రహ్మవేదధ్వనిన్
విని యారక్తజటాధరుం గుశతృణాస్వీతాసనస్థున్ మృగా
జినవాసఃపిహితాంగు నజ్జటిలుఁ గాంచెం దత్సమీపంబునన్. 129

మ. కనుఁగొన్నంతనె కన్యకామణికి లేఁగా నింత గాన్పించెఁ జ
న్మొనలన్ నీలిమి యావరించె ముఖపాండుశ్రీ మిటారించెఁ గు
ల్కునడల్ గొంచెఁ గృశించె మేనరుచి యాలో మించె నా రుల్లసిం
చె నురుశ్రాంతి జనించె గర్భము రహించెన్ మించె నిట్టూర్పుల్. 130

క. ఈలాగున బాలామణి, చూలాలితనంబు దనకుఁ జొప్పబడిన మదిం
జాలన్ జాలిం జడి యిది, యేలీల ఘటిల్లె హేతు వెయ్యదియొ కదా. 131

తే. పేరు ఋషిగాని మాతండ్రి పేరుపెంపు, గలమహారాజమణియట్టిఘనునకడుపునఁ
బుట్టి యేనిట్టిఅట్టోడిఁ గట్టుకొన్నఁ, జెట్ట యని తిట్టరే తోడిచేడెలెల్ల. 132

క. వచ్చినవేళాగుణమో, యచ్చటియోషధుల మహిమ మిటు సేసినదో
మచ్చరమునఁ గన్నెఱిక, మ్మొచ్చెము గన నెవ్వ రిటుల యొనరించిరొకో. 133

మ. కడులేఁబ్రాయపుఁబూపచన్నుఁగవసింగారంబుఁ బోనాడి యీ
కడుపున్ నేనును బోయి మోఁవ నిలువం గన్నయ్య కాపట్య మెం
చఁడె విన్నయ్యలు విశ్వసింపుదురె యేసంబంధమున్ లేనియీ
సడి నావంటిలతాంగికిన్ విధి ఘటించం జెల్లునే యక్కటా! 134

న. అని చింతింపుచు. 135

మ. స్తంభారానత యై మదావృతసముద్యద్గర్భదౌర్బల్యసం
జనితోచ్ఛ్వాసపరంపరాగతకవోష్ణమ్లానితాస్యాబ్జ యై
కనదాలోకనిరోధబాష్పకణ యై గాఢత్రపాక్రాంతి యై
జనకుం జేరి కుమారి యేమియు గణించన్ నేరకున్నంతటన్. 136

క. వంచినతల యెత్తక తన, యంచల నిలుచున్న కన్నె నట్టే యవలో
కించి యొకించుక సంశయ, మెంచి వెఱ వహించి తండ్రి యిట్లని పలికెన్. 137

ఉ. ఎక్కడఁ బోయి తింత తడ వెవ్వరికప్రియ మాచరించి తీ
వెక్కటినుండు నిన్ను శపియించె నిమేషములోన నీకుఁ జూ
లెక్కరణిన్ ఘటిల్లెఁ దగ వెంచక యింతయకృత్య మెవ్వఁడే
దిక్కున నుండి చేసె నిది తెల్లముగా వివరింపు మమ్మరో. 138

చ. కుల మపకీర్తిఁ జెంద జనకుండును వెల్వెలఁ బోవ బాంధవా
వలి దల వంపఁ దల్లి వగపం జెలికత్తెలు సిగ్గు సేటులం

గళవళ మొంద వెవ్వఁడును గైకొన కేఁగఁగ జన్మనష్టిగా
నళుకుఁ దొఱంగి కన్నెఱిక మూఱడి పెట్టుదు రేమొ కూఁతురా. 139

మ. తలవంపుల్ ఘటియించి తందఱియుఁ గాంతా యింక నీకేల యూ
దల వంపన్ వివరింపు మెట్లొవవె నేతద్గాహ్యదశ్రీ యనన్
జెలి బద్ధాంజలియై వడంకుచు భయస్వేదంబుతో మోము వి
త్వ్రేలఁ బొఱం డనుఁ గన్నతండ్రిఁ గని పల్కం బల్కు దొట్రిల్లఁగన్. 140

శా. ఏ నేపాప మెఱుంగ నాటలకుఁ దండ్రీ యీపులస్త్యాశ్రమ
స్థానాభ్యంతరభూమికిం జని పయస్యాసంఘముల గాన క
చ్చో నే నొంటి చరింప నద్భుతముగాఁ జూ లేర్పడెన్ హేతువుం
గానన్ నీచరణంబు లాన మదిఁ జక్కం జూడవే నావుడున్. 141

శా. ఆరాజర్షి వరుండు పుత్త్రివచనం బాలించి ధ్యానావధా
నాయూఢాంచితదృష్టిదర్పణముచే నాద్యంతముం జూచి యెం
తే రోమాంచముతోఁ గుమారిఁ గని తల్లీ నిన్ను శోధింప నే
నేరం బెంచితి వంతఁ జెందకుము సందేహంబు నీకేల మదిన్. 142

మ. తనుఁ గన్గొన్నది గర్భమా నని పులస్త్యబ్రహ్మముల్ పల్క నా
తనిశాపం బిది నీవెఱుంగ కెదుటన్ దర్శింప నిట్లైతి విం
దున నీ కేమికొఱంత యంచుఁ దృణబిందుం డప్పుడే పుత్త్రిఁ దో
డ్కొని బ్రహ్మాత్మజుఁ జేర బోయి భయభక్తుల్ మీఱఁగా నిట్లనున్. 143

తృణబిందుఁడు పులస్త్యుడర్శనముచే గర్భిణియైన తనపుత్త్రిని బులస్త్యబ్రహ్మకొసంగుట

సీ. మునిచంద్ర సద్గుణంబున మించునీకన్యహస్తాభియుక్తి నీకగు వహింపు
ప్రతిమహేశ్వర సతిత్వము గన్నదీశ్యామ మహీభృత్కుమారిఁ బ్రేమమున నేలు
జటిలభాస్కర చారుసంజ్ఞ యీపద్మిని ఛాయానుసారిణి సమ్మతింపు
మపరాత్మభవ నిర్మలాంగి యీమృదువాణి విద్యావతి దయార్ద్రవీక్షఁ జూడు
తే. యోగిచక్రేశ వినుమిప్ప యోషపాణి. శ్రీవిలాసినిఁ బోలుఁ బరిగ్రహింపు
శమధవర్ష భకామితార్థము లొసంగు, సురుచిశుభరాశియీబంధుసురభిఁ బ్రోవు.

క. ఆతపమునందె నిలిచి మహాతపము లొనర్చి బడలి యురుదెంచిన మీ
కీతరుణి కల్పలతవలె, శీతలసత్క్రియల నింపు సేయక యున్నే. 145

శా. అశ్రాంతశ్రుతిపాఠయత్నజనితాయాసంబు పంచాగ్ని మ
ధ్యశ్రద్ధాసహితప్రకల్పితతపస్యాకార్శ్య మత్యుగ్రమో
గశ్రాంతిస్ఫురణంబు మాన్పఁ గల దీకన్యాలలామంబు మీ
శుశ్రూషార్థము దీనిఁ గైకొనుఁ డటంచుం బుత్త్రి నర్పించినన్. 146

ఆ. ఆమహర్షి మిగుల హర్షించి రాజఋషీంద్రసుతఁ బరిగ్రహించి మామ
నత్కరించి పనుప శౌరికి మామయా, నబ్ధికరణిఁ బొంగు చతఁడు సనియె. 147

సీ. స్నానంబుగావించి చనుదెంచునంతలో జపవేదిఁ దగురీతిఁ ఆక్కఁజేయు
జపనిష్ఠ యొనరించి చాలించునంతలోఁ జక్కఁగా దేవపూజకు సమర్చు
దేవపూజ యొనర్చి తిలకించునంతలో షడ్రసాపూర్ణభోజనము పెట్టు
భోజనం బైన కరంబులు గడుగునంతలోఁ బర్ణాశనములచేఁ గానొసర్చు

తే. పాన్పుపైఁ జేరునంతలో బడలి రని మ
నంబునఁ దలంచి తాలవృంతమున విసరి
తొడలపై నంఘ్రు లుంచి యొత్తుచు ననేక
సేవ లొనరించుఁ దపసి కచ్చిగురుబోఁడి. 148

ఉ. తోయములాడుచో నొడలు దోమెదుకూర్మి గొంకింత యాఁకటన్
గాయము డయ్యనీక యొడికంబుగ నన్నము పెట్టు పేర్మికన్
రేయిఁబగల్ సపర్య లొనరించుటకుం గరఁగెం దపస్వి లేఁ
బ్రాయపుటాలి సేవలఁ గరంగరె యెంతటివారు రాఘవా. 149

చ. పలికినచో సదుత్తరము పల్కెడు కాని బహూక్తు లాడఁగాఁ
దలఁపుట కెవ్వా డేది యుచితం బది సేయుటకున్ మనోగతుల్
దెలిసి మెలంగ నేర్చుటకు దీమసమున్ వినయంబుఁ దాల్మియున్
గలుగుట కుబ్బి తాపసుఁ డొకానొకనాఁ డలకన్యతో ననున్. 150

విశ్రవోబ్రహ్మజననప్రకారము

శా. ఓలీలావతి నీగుణంబులకు నాయుల్లంబు రంజిల్లె ప
న్నాలోకింపఁగ నైన గర్భమున నీకస్మాదృశుం డాత్మజుం
డీలోఁ బుట్టెడు నేఁ బఠించుశ్రుతి నీ వేవేళ నాలించి తా
వేళన్ గర్భగుఁ డౌట విశ్రవుఁ డనన్ వీఁ డొప్పు లోకంబునన్. 151

శా. సుధ్యగ్రేసరుఁ డప్రతర్క్యనియమాస్తోకక్షమాయుక్తప
స్స్వాధ్యాయవ్రతశీలుఁ డాగమరహస్యజ్ఞానవైజ్ఞానికుం
డధ్యాత్మార్థవిశారదుం డుభయవంశాధారుఁ డబ్జాక్షరూ
పధ్యానార్కవిభానిరస్తతముఁ డీపౌలస్త్యుఁ డబ్జాననా. 152

ం. మాతామహుఁడు బితామహుఁ, డీతనయునిఁ నడకఁ జూచి యింపొందుదురం
చాతపసి యానతీయ స,తీతిలకము హర్షజలధిఁ దేలుచు నుండెన్. 153

వ. తత్కాలంబున 154

మ. శుభనక్షత్రమునన్ శుభేక్షుగ్రహముల్ సూడన్ శుభోచ్చస్థితిన్
శుభవేళం దృణబిందుపుత్త్రి గనియెన్ శుద్ధాత్ముఁ దేజస్వి నా
త్మభవున్ విశ్రవు నాతఁడున్ సకలవిద్యావైదుషిం దండ్రి నా
త్మభవుం బోలి తపంబునన్ నిలిపె స్వాంతం బంప బాల్యంబునన్. 155

సీ. పూరుషాకారంబుఁ బొందుత్రయీవిద్య బాలత్వ మొందిన బ్రహ్మచర్య
మాలోకగోచర మాధర్మదేవత ప్రాణంబు లూనినభవ్యనియమ
మవయవంబులు దాల్చినట్టివైరాగ్యంబు జంగమస్థితిఁ గన్న శాంతరసము
వైయాత్య మొందినవైదికాచారంబు బ్రాహ్మణ్య మెనయుకృపాగుణంబు
తే. దానె యన విశ్రవో బ్రహ్మ తల్లిదండ్రు
లనుమతి యొసంగ నేకతపోవనముఁ జేరి
యాశలు జయించి వెలయుభూమీశులిల
నాశలు జయించి తపము సేయంగఁ దొడఁగె 156

క. రుచిరజటారుచికీల, ప్రచయముపోలం గుశాస్తరణపరివృత్తుఁడై
శుచిభావమునఁ దపము సే, యుచు నచ్చెలుతజడదారి యున్నట్టియెడన్. 157

క. ఆముని తనయుఁ గృతేంద్రియు, యాముని యోగముఖభావితాంచత్ప్రాణ
యాముని జపఫలితప్రతి, మోమునిఁ గని రోమహర్షులైరి మహర్షుల్. 158

మ. శమసౌఖ్యామృతవార్ధిమగ్ను నతనిన్ కామాతఁగాఁ జేయుచి
త్తముతో నుత్తమతాపసుం డగుభరద్వాజుండు లేఁబ్రాయమున్
గోమరుం గల్గినపుత్రిఁ దోడ్కొని రమాకోకస్తనిన్ దెచ్చి తో
ల్లి మధుద్వేషి కొసంగ వచ్చుభృగుపోల్కిన్ వచ్చి పల్కెన్ రహిన్. 159

క. వర్ణినిధానమ యీవర, వర్ణిని మత్పుత్త్రి దేవవర్ణిని యనగా
వర్ణింపఁ దగిన దిది యా, కర్ణాంతవిశాలనయనఁ గైకొమ్మనియెన్. 160

సీ. అలమందగమనంబు హంసబోధ మొసంగఁ గాను నభోలత్వ్యగతిఁ బొసంగ
మోవికెంజిగురు జపావృత్తి వహియింపఁ బలుచాయ లష్టాంగపటిమ నింప
ఘననఖప్రభ తారకాయోగము గణింప నాననం బమృతకరాభ మించఁ [ల్పఁ
గోమరుఁ జెందు పిఱుందుగురుమహత్త్వముఁ దెల్పఁ జెఱునవ్వుముక్తాప్రసరణ దా
తే. దనతపోరీతి కుచితమై తగిన దేవ, వర్ణినీనామకన్య నవ్వర్ణి దల్లి
దండ్రులయనుజ్ఞ వరియించి తత్సమాగ, మమున, సకలగృహస్థధర్మములఁ నడపె

## విశ్రవోబ్రహ్మకుఁ గుబేరుఁడు పుట్టుట

శా. ఈలీలన్ స్వగుణానుగుణ్యమతి యానిల్లాలితోఁ గూడి యా
పౌలస్త్యుండు గృహస్థధర్మకలనాపారీణుఁడై పార్వతీ
లోలంబాలకయందు శంభుఁడు కుమారున్ గన్నయ ట్లాధరా
స్థూలాంచత్కటియందుఁ గాంచె నేకపుత్త్రున్ పుణ్యచారిత్రునిన్. 162

చ. అవిరళపుణ్యలీల యగునాశిశుసంభవవేళ భారతీ
ధవుఁ డరుదెంచి పౌత్త్రజనిఁ దప్పక కాంచి ధనేశ్వరుండు వీఁ
డవు నిఁక విశ్రవోమునికులాగ్రణి గన్నయపత్య మాట వై
శ్రవణుఁ డనన్ జగంబునఁ బ్రశస్తి వహించు నటంచు నేగినన్, 163

చ. ఉపనయనంబు సేసి శ్రుతియుక్తిఁ గా నొనరించి శాస్త్రముల్
కృపఁ జదివించి ధర్మ మెఱిఁగించి హితం బుపదేశ మిచ్చి పు
ణ్యపురుషుఁ డైనతండ్రి దను నన్నిట నేర్పరిఁ జేయ నాతఁడుం
దపమున కేగెఁ వంశగతధర్మము మానరు సాధు లెయ్యెడన్. 164

వ. ఇవ్విధంబున వైశ్రవణుఁడు తపంబు సేయం జని. 165

క. ఆహుతులఁ బ్రజ్వరిల్లెడు, స్వాహావిభులీల బ్రహ్మవర్చసము తమన్
బాహుళ్య మొంద నియమో, త్సాహంబున నుగ్రతప మతం డొనరించెన్. 166

మ. ఘననిర్ఘర్ జలపాయి యై పటుతటిత్కాంతిచ్ఛటల్ బెంజడల్
దనరన్ మించ సహస్రవర్షము లనంతక్షాంతి వాతాశనం
బున వేయేండ్లు క్రమించె మే నచలమున్ బోలన్ నిరాహారుఁ డై
తను వాశింపక యేండ్లు వేయుఁ గడపెన్ త్రైలోక్య మౌరా యనన్. 167

సీ. వద్మాప్తగతి వహింపఁగలాఁడు గావున మొనసి పద్మాప్తాధిముఖ్య మూని
మకరసంగతి మీఁద మనుఁ గాన మకరభీకరజలాకరతరంగముల నాని
ఘనవిభావసుసమగ్రత మఁదరికిఁ గాంచ ఘనవిభావసుమధ్యగత్వ మొంది
యతనువర్ధనమైత్రి నలరఁ బోయెడుఁ గాన నతనువర్ధనవృత్తి యవధరించి

తే. ఘోరతపములు సేసి మిక్కుటపుమహిమ, లవధరించినమునులు ప్రయాసమనుచు
వర్ణన లొనర్పఁ ద్రిసహస్రవత్సరములు, తపము గావించె విశ్రవస్తనుభవుండు.

వ. అంత 169

సీ. ద్వాదశదద్వాదశాత్మకకిరీటమణిప్రకాండదీధితులు లేయెండఁ గాయ
భాషాబ్జపత్త్రదృక్పత్త్రాతపత్త్రముల్ స్థిరశరచ్చంద్రచంద్రికల నీన
సురనదీతటిమరుస్ఫురణతోఁ దనతనూవరచురుల్ బంగారువానఁ గురియఁ
బ్రగుణాగమశ్రీలఁ దగుఋషుల్ కిసలయోజ్జ్వలజటాగ్రముల నంజలులు దాల్ప

తే. నగురుపాటును వడఁకును గానిపింప, నెల్లసుమనోవితానంబు నెనసికొల్వ
మందుజిగిపట్టి పొగడ విరించనుండు, కరుణఁ బౌలస్త్యజునకు సాక్షాత్కరించె.

కుబేరునకు బ్రహ్మప్రత్యక్షం బై వరంబు లిచ్చుట.

క. పెన్నిధివలెఁ దన కిటువలె, సన్నిధి సేసినకడానిచాయలజేజే
మన్నెదొర పెద్దఁ జూచి ప్ర, పన్నమతిన్ లేచి మ్రొక్కి భయభక్తులతోన్. 171

పంచచామరము. హరామరాగ్రణిస్తుతావ్యయప్రభావభాస్వరా
స్వరాదినైకలోకసృష్టిశాసనక్రియాదరా
దరాబ్జహీరహారభాస్వదారదార ధీపరా
పరాఖ్యమంత్రభృన్మనోబ్జపద్మినీమనోహరా, 172

క. అని తనుఁ బొగడినమనుమని, వినయమునకు మెచ్చి నలువ వేఁడుము వత్సా
నిను మెచ్చితి వరమిచ్చెద, నని వచ్చితి ననఁ బులస్త్యజాత్మజుఁ డనియెన్. 178

తే. లోకపతి వైననిన్ను నేలోకపాల, కత్వమును హైమగర్భుఁడు గన్ననిన్ను
బహుధనాధీశ్వరత్వంబు బ్రార్థనంబుసేయుచున్నాఁడుఁ గట్టడ సేయుమయ్య.

ఉ. కామితదాయి వైననినుఁ గన్గొనినంత ననంతలోకలో
కామితచింతితార్థము లయారె లభింపవె యంచు వేఁడివఁ
దామరచూలి వల్కె ధననాథపదంబు దిగీశ్వరత్వముఁ
నే ముదమంది నీకె కరుణించితి దేవత లెల్ల మేలనన్. 175

క. ప్రాగపరదక్షిణమునకు, నీగిరిరిపువరుణయముల సృజియించి యుద
గ్భాగమున కొకనిఁ దలఁపఁ, గాఁ గలిగితి నీవు మేము కౌతుక మొందన్. 176

ఉ. పాలితసత్యధర్మమగు బ్రహ్మకులంబునఁ బుట్టినట్టివన్
నాలవవానిఁ జేయఁ దగునా యనఁ బోకు దిగీశ్వరాళిలో
నాలవవాఁడ వై బహుధనస్థుఁడ వై మను మంచు మన్నికన్
లాలనసేసి ధాత యొకనవ్యవిమాన మొసంగి వెండియున్. 177

ఆ. పుష్పకాఖ్య మిది యపూర్వయానము దివ్య, పుష్పకాయమానపూజ్యమాన
మీవిమాన మెక్కి యెల్ల వేల్పులలోన, నీవి మాన కలరు మింక ననుచు. 178

కుబేరుండు దండ్రి యనుజ్ఞవలన లంకం జేరుట

మ. సవిశేషాదరభాష లాడి యజుఁడున్ జన్నఁ ధనేశుండు వి
శ్రవుఁ జేరఁ జని మ్రొక్కి తండ్రి భవదాజ్ఞన్ బ్రహ్మ మెప్పించి యి
ష్టవరంబుల్ గొని వచ్చితిన్ తగునివాసం బాయజున్ వేఁడ నై
తి వినూత్నస్థల మెయ్యె దెందు నిలుతున్ దెల్లంబుగాఁ దెల్పవే. 179

అ. ఈతిబాధ లేక యింతైనఁ బగవారి, చేతబాధ లే చెలువు గలుగు
నట్టిగీము వలయు నావతి యిమ్మన్నఁ, బట్టిమోముఁ జూచి పలికె గురుఁడు. 180

మ. కల దీదక్షిణవార్ధి మధ్యమున లంకానామదివ్యత్పురం
బలఘుస్రాక్తటినీవిటోత్కటమణధుర్యావార్యహార్యశ్వర
థ్యాలసత్కూటరఖురాగ్రసౌధగతపంకాలేపసంక్షాళనా
కవితాకాశతరంగిణీతరళరంగత్తుంగభంగాఢ్యమై. 181

సీ. కనకకుంభప్రభాకలన బాలార్కవిభ్రమముఁ జూపెడుగోపురములు గలుగ
ధర్మభూమిధరంబు పలురూపులాయెనో యనిమించునర్మహర్మ్యములుగలుగ
హీరకాంతులచేతఁ దారకావళిఁ గేరులసమానలీలాచలములు గలుగ
నగరీందిరాదేవి నడుమఁ బూనినకాంచి కొమరు గాంచినపైఁడికోట గలుగ

తే. భూరివైడూర్యతోరణస్ఫురితవిపణి, మార్గములు గల్గ స్వర్గసామ్యముగ విశ్వ
కర్మ నిర్మించె నిర్మాణకౌశలమున, రాక్షసార్థంబు మున్నప్పురము కుమార. 182

క. ముందు ముకుందునిభయమున, నందు నిలువ వెఱచి దైత్యులందఱు సుతలం
బొందిరి నిర్భయపద మది, నెంచి సుఖంపుమని తండ్రి సెలవిచ్చుటయున్ 183

సీ. ఉపవనీరమ మారుతోత్పతత్కుసుమరాజీకైతవంబున సేస లిడఁగఁ
బ్రాకారలక్ష్మి నవజ్రపుత్రాలతలుకుచేఁ దనమేన మంచిగందంబుఁ బూయ
భర్మగోపుర వరత్పారావతద్విజశ్రేణి పల్కులనె యాశీర్వదింప
జరామార్గచిరత్నరత్నసౌధశ్రీలు గడురక్తి కుంకుమ గానుక సేయఁ
తే. గేళిభూభృత్పరంపరల్ కేతనాంశు, కాప్తిఁ బావడ లూన ముక్తాళిధామ
లలితరుచిధూతచంద్రకలంకఁ లంక, రాజసమునఁ బ్రవేశించె రాజరాజు. 184

మ. ధనదుం డీగతి లంకఁ జేరి సురగంధర్వాప్సరస్సేవ్యుఁ డై
తనయాజ్ఞోన్నతి నైరృతుల్ భయము జెందఁ దత్పురం బేలుచున్
జనయిత్రిన్ జనకున్ గనుంగొనఁగ నిచ్చల్ పుష్పకారూఢుఁ డై
చనుచున్ గ్రమ్మఱుచున్ సుఖించె నతులైశ్వర్యం బవార్యంబుగన్. 185

తే. అని యదంభవచోనిగుంభనలఁ గుంభ, సంభవుండు పులస్త్యవంశక్రమంబు
గొంత దెలిపిన విని శ్రీరఘుప్రవీర, వర్యుఁ డిట్లను నాశ్చర్యమధుర్యుఁ డగుచు.

శా. ఓవింధ్యాచలగర్వనిర్హరణయాత్రోద్యోగ పూర్వంబు లం
కావాసంబు సురారిని ఘులనికాయ్యం బంచు మీ రానతీఁ
గా విన్నప్పటినుండి చిత్రరసశంకాసంకులం బయ్యె మ
ద్భావం బంతకు మున్న తాదృశబలుల్ దైతేయు లెవ్వారొకో. 187

ఉ. ఆదిఁ బులస్త్యవంశభవు లాసురముఖ్యు లనంగ వింటి నే
తాదృశరాక్షసాధికులు దానవు లంతకు మున్నె లంకలోఁ
గాదుక యుండు రం చిపుడు పల్కితి రీదశకంధరప్రహ
స్తాదులతం టె వీరువరు లై నసురారులు వార లెవ్వరో. 188

ఉ. వారికి వంశకర్త యగువారి తెఱంగులు వారి పేరులున్
వారిబలోన్నతుల్ పిదప వారు ముకుందున కోడి లంకనున్
జేరక పోవుటల్ జటిలశేఖర తెల్పుము విస్తరించి నీ
చారుసుధారసోపమవచఃకలనన్ జెవు లింపు సెందెడిన్. 189

ఉ. భానునిచే మహాతమముఁ బాయు తెఱంగున మాను మాదృశా
జ్ఞానము మిమ్ముబోఁటిబుధచంద్రులచే నని జానకీబహిః
ప్రాణము రామభూవిభుఁడు ప్రశ్న మొనర్ప దరస్మితంబుతోఁ
దా ననిమెన్ దథావిధకథావిదుఁ డమ్ముని సమ్మదంబునన్. 190

మ. రవివంశోత్తమ సంశయం బయిన చో, బ్రశ్నంబు గావింప నే
ర్తు వినన్ నేర్తువు సావధానముగ విన్ స్తోత్రంబు సేయంగ మా
కు వశం బే పరమేష్ఠినుండియును రక్షోవంశ మాద్యంతమున్
వివరింతున్ వినుమం చగస్త్యుఁ డను బ్రావృట్కాలమేఘార్భటిన్. 191

## రాక్షసవంశోత్పత్తి క్రమము

మ. హరినాభీకుహరారవిందమకరందానందనేందిందిరం
బు రహిన్ మించి విరించి యంచితతనస్ఫూర్తిన్ జగత్సృష్టిపై
ఖరిఁ బ్రాపించి మహాజలంబు దొలుతన్ గల్పించి తద్రక్షణా
కరకాంక్షన్ సృజియించె సత్త్వముల సంకల్పంబునల్పంబుగన్, 192

శా. ఆసత్త్వంబులు క్షుత్తృషాతురత బ్రహ్మన్ జేరఁగా వచ్చి వి
శ్వాసంబుల్ గనుపింప నేమి యొనరింపన్ మమ్ముఁ బుట్టించి తీ
వో స్వామీ యిపు డేమి సేయుదుము నా సూక్తీశుఁడున్ నవ్వుతో
మీసార్థ్యముఁ జూత బుజ్జలము నెమ్మిన్ బ్రోవుఁడీ నావుడున్, 193

మ. జలసంరక్ష యొనర్తు మంచుఁ జని యాసత్త్వావళుల్ క్షుత్తృడా
విలభావంబు వహింప కంబుహృతి గావింపంగ నుంకించి [illegible]
చల బ్రహ్మన్ గని కొంచి కొన్ని యనె "జక్షామః" [illegible]ర్థవా
క్కులనన్ నీళ్ళ వసించుకొన్ని యనె "రక్షామః" తి వ[illegible]ఖరిన్. 194

తే. అపుడు పరమేష్ఠి జక్షింతు మని పలికిన, జంతువులయక్షులగుచుఁ బ్రశస్తి జెందు
డనియె రక్షింతు మనిపల్కినట్టివారి, దాక్షసులుగ నండ్రుఁ బల్కరఘువరేణ్య

## హేతిప్రహేతుల వృత్తాంతము

ఆ. రామ యట్టి యక్షరాక్షసకోటిలోఁ, బెంచఁ దగినవీరు లిద్దఱై
యెవ్వరన లాయగ్ని హేతి బోలినహేతి, హస్తదీప్రహేతి యగుప్రహేతి. 196

క. ఘాటప్రతివీరులు మధు, కైటభనిభవిక్రమప్రకారులు పటుబా
హాటోపపేటు లాదిని శాటులు హేతిప్రహేతు లద్భుతహేతుల్. 197

క. వారలయందుఁ బ్రహేతి యు, దారుఁడు కామాదిరిపువిదారుఁడు శ్రితమం
దారుఁడు గుణనందితబృం, దారుం డనపేక్షితార్థదారుం డయ్యెన్. 198

మ. భయదూరుఁడై యలహేతి తాత పనుపన్ భార్యాకుమారస్పృహో
భయసంగాత్మకుఁ డౌటఁ గాలభగినిన్ భద్రేభకుంభస్తనిన్
భయ యన్దానిఁ బరిగ్రహించె దశదిగ్భాగస్ఫురన్మల్లికా
భయశఃపాండురమౌక్తికప్రతతి పైపై సేస గావింపఁగన్. 199

క. ఆశాతోదరి విద్యు, త్కేశుని సంధ్యాబ్దనికటదీపితవిద్యు
త్కేశునిఁ దేజశ్శోచి, ష్కేశునిఁ గనె హేతి ప్రీతి చెన్నువహింపన్. 200

శా. విద్యుత్కేశుఁడు తోయజాంబుజముఖిన్ దాన్నకీర్త్యున్నతిన్
విద్యాభ్యాసివివేకమున్ వలె మహాజ్ఞాని వైరాగ్యమ
ట్లుద్యోగస్థునికల్మిలీల హరయోగోద్భాసియాయుర్గతిన్
ఖద్యోతద్యుతి వృద్ధిఁ బొందెఁ బితృరక్షం జేసి నానాఁటికిన్, 201

మ. నవవర్షాగమజృంభితాంబుదముచందానన్ మధుస్ఫూర్జితా
టవిలీలన్ బటుయౌవనస్ఫురదవష్టంభంబునన్ బుత్త్రకుం
డు విజృంభించినరీతి హేతి గని సుష్ఠుప్రీతిఁ బ్రాపించి వా
నివయోరూపవిరూఢికిన్ దగినకన్నెం గాంచి గావింపఁగన్. 202

సీ. కమనీయకమలకోశములతో సమము లై కులుకుగుబ్బ మెఱుంగుగుబ్బ లమర
ననమాననీలోత్పలసమానరుచు లొంది కలికిసోయగపువాల్గన్ను లలర
శ్రీనందనస్యందనానందరథాంగపటిమ విస్తృతనితంబము రహింపఁ
గంజరాగము మీఱుసంజకెంజిగిఁ దీరు వహియించి కెమ్మోవి వన్నె మిగుల
తే. నిరులసరులను బెన్నెఱు లిరవుకొనఁగఁ, దారకస్ఫూర్తి గన నఖోదారకాంతి
సంధ్యవలె మించుసంధ్యాత్మజాలలామఁ, బ్రియకుమారున కాహేతి పెండ్లి సేసె.

శా. తత్కాలంబునఁ జారుగాత్రి యగుసంధ్యాపుత్త్రిఁ బ్రాపించి వి
ద్యుత్కేశుండు శచీసమేతుఁ డగునింద్రున్ రోహిణీయుక్తుఁ డౌ
సత్కాంతున్ గిరిజావిలోలుఁ డగుపశ్యత్ఫాలునిన్ బోలి య
త్యుత్కంఠోత్థరతిక్రియన్ మదనదేవోపాస్తి గావింపఁగన్. 204

ఉ. నీలపయోదయుక్చపల నీటున నాథునిఁ గూడి యొప్పునా
సాలకటంకటాయువతి స్వాతిగతాంబుదవృష్టి శుక్తియున్
బోలె నిజేశుతేజమున భూరితరంబుగ నంత గర్భమున్
దాలిచి మందరాచలనితంబమునం దురుసాహసంబునన్. 205

మ. పరు లెవ్వారును గానకుండ నిజగర్భస్థార్భకున్ దద్ధరా
ధరమధ్యంబున డించి వహ్నిజనితోద్యద్గర్భభారంబు మాన్
శరమున్ జెచ్చినగంగఁ బోలి సురతేచ్ఛాలోల యై జీవితే
శ్వరుఁ జేరన్ జనెఁ బాప మెంచకుగదా చానల్ రఘుగ్రామణీ. 206

శా. ఆసంధ్యాతనయావిసృష్టశిశు వాస్యాంతస్స్ఫురన్ముష్టి యై
యాసన్నక్షితిభృద్గుహల్ బదులు మ్రోయన్ గాలజీమూతగ
ర్జాసామ్యధ్వని రోదసంబు ఘటియింపన్ నాగ సింహాదినా
నాసత్త్వంబులు తద్ధ్వనిన్ బెదరి చింతన్ జేర తేకేఁగఁగన్. 207

వ. అప్పుడు. 208

సీ. బలుకెంజడలతోడఁ దెలిగన్నెరులవన్నె గలక్రొన్నెలవతంకంబుతోడ
వలుఁదశూలముతోడ నలినుబ్బునలమబ్బువెలిద్రొబ్బుగరళభృద్గళముతోడ
గిబ్బతత్తడితోడ గిరిరాజు హరిరాజుఁ గరిరాజు నగుమేనికాంతితోడఁ
బునుకకంచముతోడ వనతూపులనయేపు గన నోపుదారబూదిమినుకుతోడఁ
తే. బ్రమథతతితోడఁ బార్వతీప్రమదతోడఁ, గరిముఖాదికుమారవర్గంబుతోడ
శివుఁడు మంథానగిరితుంగశృంగవీథిఁ, జెలువుమీఱంగ స్వారి వేంచేయు నపుడు.

## సుకేశుం డను రాక్షసుని వృత్తాంతము

క. వాపోయెడుసంధ్యాతన, యాపత్యముదిక్కు జూచె నభవుఁడు కారు
ణ్యాపారసుధాపూర. వ్యాపారకటాక్షవీక్షణాతిశయమువన్. 210

క. అంగజహరుఁ గని ప్రియ మెన యంగ జగజ్జనని గిరిజ యవధా రహిరా
డంగద యీపసిపాపని, యంగదఁ బాయంగఁ జేయ నర్హం బనినన్. 211

మ. ప్రియురా లాడినమాట దాఁటక పురస్త్రీచిత్రకత్నాళనా
క్షయదుర్ధర్షశరుండు శంభుఁడు దయాంచద్బుద్ధిఁ దద్బాలుఁ జూ
చి యమర్త్యత్వము మాతృసన్నిభవయశ్శ్రీస్ఫూర్తియుఁ విశ్వది
గ్జయతేజంబు నభశ్చరత్పురముఁ గల్గంగా వరం బిచ్చెనన్. 112

శా. శ్రీగౌరీజలజాయతాక్షి పలలాశశ్రేణికిం గూర్మి స
ద్యోగర్భాతిశయప్రసూతులును సద్యోయావనప్రాప్తి స
ద్యోగాఢప్రతిభాపరాక్రమజయోద్యోగంబు లిచ్చెన్ లస
ద్యోగారూఢమనఃప్రసన్నుఁ డగు కాంతుం డట్టు లౌఁ గాకనన్. 213

క. దేవికి వేడుక యవు నని, దేవరయుఁ వరము లొసఁగ దేవరఁ గనుచున్
దేవియు సాటికి బేటికి, దీవింపఁగ దైత్యశిశువు తేవము నొందెన్. 214

చ. జనని సుఖంబె కోరి కని శైలతటంబునఁ బాఱవైచి పో
యినశిశు వేడ వానికి యతీంద్రులకైన గవరాని వేలుపుల్
గనఁబడి కోర నేరఁ డని గాఢవరంబు లొసంగు టేడ య
ద్దనుజునిపూర్వజన్మసుకృతం బెటువంటిదొ గాక రాఘవా. 215

ఉ. ధారుణిలో నరక్షితుఁడె దైవసురక్షితుఁ డందు రార్యులా
వా రది యట్టులుండె రఘువంశసుధాంబుధిచంద్ర వింటివే
యారజనీచరార్భకుఁడు నంత సుకేశుఁ డనన్ బ్రసిద్ధుఁడై
గౌరియు శంభుఁడున్ బనుపఁగా శివదత్తపురానువర్తియై. 216

సీ. జలజాతరాగమండలపిచండిలమండలావిష్టుఁ డగుభాను ననుకరించి
తపనీయదివ్యరత్నవిమానసంచరిష్ణుఁడై నిర్వహించుజిష్ణుని హసించి
బహుయోజనాయతప్రథమానరథ మెక్కి చరియించుపూర్ణిమాచంద్రుఁ డెగడి
కనకాచలాంగసంగతపతంగవాహనుం డగువిష్ణువైఖరి నగి
తే. గగనబహుపాద్ధరారుహాగ్రము స్వకీయ పురమణీదీప్రవప్రగోపురవిభామ
తల్లికావల్లికాశ్రేణు లల్లికొన సు,కేశుఁ డలరారె నంబరకేశుకరుణ. 217

క. ఆమనుజాశస్తోమల, రామునికీర్తిప్రతాపలావణ్యంబుల్
గ్రామణి యనుగంధర్వ, గ్రామణి తిలకించి కౌతుకం బలరారన్. 218

సీ. వేణికారుచిఁ గృష్ణవిభవంబు వహియించి ముఖదీప్తిఁ బూర్ణసోముని గ్రహించి
దనుకాంతిఁ గనకగర్భనియాఢిఁ బ్రాపించి స్తనలీల గిరిజాతఘనతఁ గాంచి

వరనాభిగతి దేవపల్లభోన్నతి నొంది మధ్యరీతి ననంగమహిమఁ జెంది
కటితటిస్ఫురణఁ జక్రహితాభ్యుదయ మూని నడలచే శిఖివాహనటన మూని
తే. సౌరభంబున సుమనఃప్రసక్తి మీఱి, యఖిలమనోగుణంబుల నతిశయించు
దేవవతి యనుతనకన్యఁ దెచ్చి యిచ్చె, నలసుకేశాఖ్యునకు భానుకులవరేణ్య.

సుకేశుండు దేవవతిని వరించి మాల్యవదాదులం గనుట

శా. రక్షోరాజ్యరమావధూటి యనఁగా రంజిల్లునప్పద్మప
త్త్రాక్షిన్ బెండిలి యై సుకేశుఁ డధనుం డర్థంబుఁ బ్రాపించిన
ట్లక్షీణస్పృహ మించె నద్దివిజకన్యారత్నముల్ నిర్జరా
ధ్యక్షున్ జెందుపులోమజన్ దెగడె దీప్యద్భోగభాగ్యోన్నతిన్. 220
చ. కరియుఁ గరేణువున్ బెనఁగుకై వడి నిచ్చలు హెచ్చుమచ్చికల్
దొరసి సుఖించువారలకుఁ దోడ నె పుట్టిరి పావకత్రయ
స్ఫురణఁ ద్రిలోకసంగతిఁ ద్రిపూరుషమంత్రగతిన్ ద్రినేత్రవై
ఖరిఁ ద్రిగుణంబులున్ బలెఁ ద్రికాలములట్టుల ముగ్వు రాత్మజుల్. 221

మాల్యవదాది రాక్షసుల చరిత్రము

మ. వియదంభోమరుదున్నతిన్ వెలయునప్పిత్రత్రయిన్ సద్విరా
జియశోనిర్మలమాల్యవంతుఁ డన మించెన్ మాల్యవంతుండు ద్వి
ట్చయ సంపత్కసుమాలి నాఁ దదనుజాంచత్ఖ్యాతిఁ గాంచెన్ సుమా
లియుఁ దేజోవిజితాంశుమాలి యయి పొల్చెన్ మాలి దద్భ్రాతృతన్. 222
శా. ఆరక్షస్త్రితయం బుపేక్షితమహావ్యాధిత్రయంబున్బలెన్
దారుణ్యంబు వహించి తంద్రికరణిన్ దా నెంతయున్ దేవతా
కారుణ్యఁబులఁ గామితంబులు గనంగా నెంచి యంచత్తపః
ప్రారంభంబు వహించి కాంచనగిరి ప్రత్యంతశైలస్థమై. 223
శా. కీలాలం బని నీరు గోరిలురహిం జుక్కించెన్ బలాశంబు లం
చాలోకించుట మానెఁ బర్ణముల మధ్యాఖ్యన్ ప్రవర్తింపఁగాఁ
జాలించెన్ విరిదేనె చాయ దొరయన్ జన్నన్ రవిద్రోహదు
శ్శీలఁభా నని రాక్షసత్రయ విసర్జించెన్ దరుచ్ఛాయయున్. 224
మ. అతిలోకం బగుతాల్మితోఁ దపము లిట్లారాక్షసుల్ సల్పఁగా
యతిలోకం బరుదందె నంతటఁ దదీయప్రాంచితాచారసూ
నృతసంభావ్యమహాతపోజనితవహ్నిజ్వాలికామాలికా
హతి ముల్లోకములున్ దపింపఁ గని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁడై. 225

మాల్యవదాదులకు బ్రత్యక్షమై బ్రహ్మ వరంబులొసఁగుట

సీ. పలలభోజనతపోనలము వేఁడిమి నంచ తేజి బంగరుఱెక్క తేజరిల్ల
దోషాచరతపోగ్నిధూమాళి భారతీధవలాక్షికొప్పుపూదండ లోన

దనుజత్రయీతపోదమనస్స్ఫులింగముల్ మహనీయమకుటాగ్రమణుల నొరయ
దైత్యమూర్ధన్యమూర్ధజశష్పశిఖాచయముచే సావిత్రి మెయి సమర్ప

తే. నుగ్రనిష్ఠాగరిష్ఠు లై యుగ్రమహిమ, నుగ్రతపమును గావించుచున్న రాక్ష
సాగ్రణుల చెంత కరుదెంచి యట్టె కాంచి, వెఱఁగుమించి విరించి దీవించి యనియె

ఉ. ఇంకఁ బ్రయాస మొందవల దే మిము మెచ్చితిఁ గోర్కు లిచ్చెదన్
శంకఁ దొఱంగి లెం డసురశంకరులార యటంచు భారతీ
పంకజలోచనాకచవిభాసురకేసరవాసనాగతా
హంకరణాళిఝుంకరణహారిమృదూక్తుల నానతిచ్చినన్. 227

మ. అమృతాంభోధితరంగఘుంఘుమరవోద్యత్తన్మృదూక్తిన్ గత
శ్రము లై కన్నులు విచ్చి రాక్షసులు సాక్షాత్కార మై యున్న బ్ర
హ్మముఖాంభోజముఁ జూచి లేచి భయసంభావాప్తి సాష్టాంగదం
డము లర్పించి నుతించి రిట్లని లలాటన్యస్తహస్తాబ్జు లై. 228

మ. పురుషుం డందుఁ బరేశ్వరుం డనుచు వేల్పుం బెద్ద యంచున్ మహే
శ్వరుఁ డంచుం బరమాత్ముఁ డంచు శ్రుతిశాస్త్రజ్ఞానపారీణు లే
ర్పఱుపం జాలక పెక్కు భేదముల నే భవ్యాత్ము నూహింతు రా
పరమేశున్ నినుఁ గొల్తు మేము శుభముల్ ప్రాపింప నశ్రాంతమున్. 229

శా. ఆశాస్యంబులు నీవలెన్ నతుల కీగన్ జాలు జేజే గలాఁ
డే శశ్వత్కృప మా యెడన్ నిలిపి తండ్రీ ప్రోచెదేనిన్ సము
న్నాశాధీశజయప్రతాపములు దీర్ఘాయుస్సదారోగ్యవి
ద్యాశాలిప్రతిభల్ పరస్పరహితత్వంబున్ బ్రసాదింపవే. 230

క. ప్రభవిష్ణుల మై యెందును, నభివృద్ధి వహింతు మనుచుఁ బ్రార్థించినఁ బ
ద్మభవుం డాదరమున న,య్యభిమతము లొసంగి చనియె నాత్మీయులతోన్. 231

వ. అంత 232

## మాల్యవదాదులు లోకంబుల బాధించుట

శా. భాషానాథవరప్రదానవిలసద్బాహాబలాటోపు లై
దోషాటాధిపతుల్ మదాంధత సుధాంధోముఖ్యులన్ గెల్చి త
ద్యోషారత్నములన్ గ్రహించి మునులన్ దూలించి సాధ్యాదులన్
రోషాగ్ని దపియింపఁ జేసి సురవైరుల్ మెచ్చ వర్తించినన్. 233

సీ. పట్టుగానక బయల్ వట్టి రాదిత్యులు ఖచరులత్రోవలు గట్టువడియె
దీను లై గరుడులు దెస చెడి పాఱిరి తుషితులు బడలికతోఁ దిరిగిరి
వసువులు పేదలవలె గాసి చెందిరి గమి బాసి రుద్రులు గాడుపడిరి
యడ్డగింపులకు లోనైరి మరుత్తులు చేరిరి గిరిగుహల్ సిద్ధవర్యు

తే. లోఁడి గంధర్వులుండనీఁ బోఁడి రచ్చరలకుఁ జెఱ లుప్పతిలవె మహారాజికులకుఁ
గలిగెఁ దలఁకంప దింపనివలసపాటు రాక్షసులు సేయు రాఘుడి రఘువరేణ్య,

క. నిరయగతు లైన ప్రాణుల, కరణిన్ రక్షకుని నొకనిఁ గనక సుకేశా
సురసుతబాధితభువనాం, తరగతు లాపదలఁ బడిరి తత్కాలమునన్. 235

శా. ఆరాత్రించర శేఖరుల్ ముగురు నిట్లాదిత్యహృద్భీకర
స్వైరస్ఫారవిహారులై తమకు భూస్వర్గంబులీలన్ మనో
హారం బౌనగరం బొనర్చుటకుఁ గా నర్థించి శిల్పప్రభా
ధౌరేయుం డగువిశ్వకర్మఁ దలఁపన్ దద్ధర్మ్యుఁ డేతెంచినన్. 236

ఉ. మాల్యవదాదు లిట్లను సమర్త్యులకల్మియు బల్మి కీర్తిబా
హుళ్య మెఱింగి వారికి యథోచితగేహము లీ వొనర్పఁ బ్రా
బల్యముఁ జెందె నీచతురభావము దిక్కుల నోయి శిల్పకౌ
శల్యవిధాన మాకు నిఁక సద్గృహముల్ రచియింపఁగాఁ దగున్. 237

మ. హిమవత్పర్వతమాళిమీఁద నయినన్ హేమాద్రిపై నైన మం
థమహీధ్రాగ్రణిమీఁద నైన, గలధౌతక్షోణిభృచ్ఛృంగతుం
గమణీగోపురసౌధయూథములు గల్గన్ మాకు నిర్మింపు గే
హము లంచున్ వచియింప నయ్యమరశిల్పాచార్యవర్యుండనున్, 238

విశ్వకర్మవలన నెఱింగి మాల్యవదాదులు లంకఁ జేరుట

ఉ. దక్షిణవారిరాశితటధారుణి భాసుర మౌఁ ద్రికూటనా
మక్షితిభృద్వరేణ్య మసమానమణీయసానుసంపదన్
దక్షిణదిక్త్రికూట మనఁ దద్గిరిశృంగమునం దొనర్చితిన్
రాక్షసులార ము న్నొకపురం బసురేంద్రు నియాజ్ఞ పెంపునన్. 239

వ. అదియును షష్టియోజనవిస్తీర్ణంబును శతయోజనాయతంబును వినిర్మలముక్తా
ఫలవిర్మితనర్మహర్మ్యచ్ఛదచ్ఛటాధవళిత హరిదశ్వహయోత్తురంగంబును నుత్తుంగ
గోపురోపరిద్వారాంతరస్థాపితకాంచన పాంచాలికా బాలికాస్తనాంతరక్షౌమ
పటోత్తరీయాయితవియత్తటినీతరంగంబును వాసవకృతత్రాసనిరాసార్థవనరాశి
సమానీత కలధౌత గిరిపోతతులిత లలితమణిమయ క్రీడాచలవిరాజమానంబును
నిజవైభవాధఃకృతసమగ్ర సౌభాగ్య లక్ష్మీప్రార్థనానిమిత్తసమాగతభోగవతీపుర
వ్యాజకపరిఖాయితాంభోధిగతాత్మ ప్రతిబింబంబును శతకోటి శివాలయనీల
ప్రాకారజాలప్రభాభిధముధాభ్రమర సముపసూరుణ కమలాయిత కమలహిత
మండలంబును నాయికోచిత మరకత మణిమయఘననివసనకనకవసనగగనలక్ష్మీ
ప్రకల్పితపుష్పహారాయితతారాప్రతానంబును వనపవనచలితలతాప్రతాన
పతత్ప్రసూనపరిమళవాసితపరాగవాసితాజాండకరండంబును సమస్తవస్తువిశేషం
బునకు జన్మనివాసంబును నఖిల విభవలక్ష్మీవిలాసంబునకు వీడుపట్టును నై
కనుపట్టునట్టుగా గంగావిశకున దుష్ప్రవేశంబును టంకాగ్రవిచ్ఛిన్న చతుర్దిశా

వకాశంబున సగుత్రికూటశిఖరిశిఖర ప్రదేశంబున స్వర్గలోకవస్త్వాకసారాది దిక్పాలపురంబులు నిర్మించి యాఱితేఱినశిల్పనై పుణ్యము మెఱిసి నిర్మించిన యాలంకాపురంబు మీకాఁపురంబునకుఁ దగు నందు నిలువుం డని వెండియు విశ్వకర్మ వారలం గొనుంగొని. 240

శా. లంకాదుర్గముఁ జేరి శాత్రవులకున్ లక్షింపఁగా రాకని
శ్శంకఖ్యాతిఁ గనం గలా రని గణించన్ శిల్పసమ్రాట్సుధా
సంకాశోక్తుల నుత్సహించి బహుకక్ష్యాళితో దోర్బలా
హంకారంబునఁ జేరి రప్పురి నిశాటాధ్యక్షు లుత్కృష్టులై. 241

## —మాల్యవదాదులు వివాహమై పుత్త్రవంతు లగుట—

శా. ఆలేఖద్విషదగ్రగణ్యులభుజాహంకార తేజోనయ
శ్రీ లెల్లం దిలకించి నర్మద యనం జెల్వొందుగంధర్వి సు
శ్రీలావణ్యగుణాభిజాత్యముల హ్రీశ్రీకీర్తులన్ బోల్ప నా
స్త్రీలన్ ముగ్వుర నిచ్చె నాత్మసుతలన్ జ్యేష్ఠానుపూర్వంబుగన్. 242

తే. నర్మద నలిప్రహాసితమహోర్మికలిత, నర్మద సుపర్వసతి యయ్యు దుర్మదులకు
నసురులకు నెట్లొసంగెఁ గన్యకల సనకు, కలిమిగుణ మట్టి దిక్ష్వాకుకులవరేణ్య. 243

చ. మరుఁడు త్రిలోకమోహకరమాత్రనిగుంభితమార్గణత్రయిన్
దరుణులు గా నొనర్చి భువనత్రయభీకరరాక్షసత్రయిన్
మఱలున ముంప నంపెనొ యనన్ దగునజ్జవరాంగన ముగ్వురన్
బరిణయమై యమర్త్యులక్రమంబున వారు సుఖించి రంతయున్. 244

వ. అంత. 245

క. సుందరి యనునిజసుందరి,యందుఁ గనియె మాల్యవంతుఁ డాత్మజ నొకతెన్
నందనుల నేడుగుర విను, మందజనాపహములు దశరథాత్మజతిలకా. 246

## —మాల్యవదాదులకు వజ్రముష్ట్యాదిరాక్షసులు పుట్టుట—

మ. అనిశక్రోధుఁడు వజ్రముష్టియు విరూపాక్షాఖ్యుఁడున్ దుర్ముఖుం
డును సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁ డనువాఁడున్ మత్తు, డున్మత్తకుం
డనలానామకుమారియున్ బొడమినన్ హర్షించె నమ్మాల్యవ
న్మనుజాశీంద్రుఁడు పుత్త్రవంతుఁడును సంపన్నుండు నై రాఘవా. 247

క. కేతుమతి దృక్సమాంగజ, కేతునుతి సుమాలిసతి శుకీవాణి తనూ
జాళులఁ దనుజాతులఁ గనె, సీతాధిప వారిపేళ్ళు సెప్పెద వినుమా. 248

వ. సుప్రహస్తుం డనన్ దగుప్రహస్తుండును రణస్థలాకంపనుం డగు నకంపనుండును రవికటుండగు వికటుండును విధ్వస్తశత్రుస్యంధన్యస్తశకటీముఖుండను శకటీ ముఖుండును బహుమహసానలధూమ్రాక్షుం డగుధూమ్రాక్షుండును నుద్దండ భుజాదండుం డగు దండుండును జతురంగబలాక్రాంతసుపార్శ్వుం డనన్ దగు

సుపార్శ్వుండును వహ్నిసంహ్రాద్రి యగుసంహ్రాదియుఁ దనుప్రభాప్రహసితోద్దీప్త
ఘనుం డగుప్రఘనుండును మాగధీభూతసుస్తవనశ్రవణ సముదాసకర్ణుం డగు
భాసకర్ణుండునుఁ బుట్టి దిట్టతనంబునఁ జేపట్టి రట్టిరట్టడివీరులకుఁ దోఁబుట్టువు
లై బాలయున్ బుష్పోత్కటయున్ గైకసియున్ గుంభీనసయు ననఁ దగు
కన్నెలు చెన్నువహించి రంత. 249

మ. వసుదావోపశమాంబుదప్రతిమదీవ్యద్గాత్రుఁ డన్మాలియుం
వసుదారిద్ర్యయుతుండు పెన్నిధులఁ జెందన్ గోరుచుండంబునన్
వసుదాభామినిఁ గూడి శౌర్యనిధులన్ వాంఛించి విద్వేడ్విభా
వసుయాదులఁ గాంచెఁ బుత్రులఁ జతుర్వారాశిసంకాశులన్. 250

క. సరసుం డనలుఁడు ననిలుఁడు, హరుఁడున్ సంపాతి యనఁగ నల్ల నలువురున్
బురుషార్థంబులవలె నొ,ప్పిరి రాఘవ వారె కద విభీషణమంత్రుల్. 251

మ. ఇటు లమ్మాల్యవదాదు లాత్మజులతోఁ నింద్రాదిదిక్పాలకో
త్కటసంపద్గరిమంబుతోఁ ద్రిభువనత్రాసప్రదోద్యద్భటో
ద్భటధాటీఘటితాస్ఫటీపటిమతోఁ దా రందఱున్ గూడి ము
న్నటిలీలన్ గరుడోరగామరమునీంద్రశ్రేణి బాధింపఁగన్. 252

## సురలు మునులు శివునిపాలి కరిగి యసురులం బరిమార్ప వేఁడుట

ఉ. వారియుపద్రవం[illegible]వాఁ[illegible]నై భవులై సమస్తబృం
దారకులున్ నసి[illegible] దగుతా వికె నెయ్యది యేది త్రోవ యె
వ్వారికి విన్నవింపుదము వైరులరా పని చింతఁ జేసి యు
ద్భారి పురాపహారి యొకఁడే పాపఁ గలాఁ డని నిశ్చితాత్ములై. 253

తే. శ్వేతరుచిభూతిఁ దగి భవ్యశృంగకలనఁ,దనరి గజముఖసంయుక్తిఁ గని యనంత
పాదకటకాప్తి నెంతయు బాగు మీఱి, శివునివలె నున్న కైలాసశిఖరిఁ జేరి 254

సీ. అహిరాజభూషణుం డైన యీవేల్పు మాయహిభయం బేరీతి నడఁచు ననక
యెపుడుఁ గుత్తుక విషం బిడుకొని మాటాడు నితనిమాటలు నమ్మ నెట్టు లనక
శివవారితనముతోఁ గనుఁ బుణ్యజనుల నీయన పుణ్యజనవైరి యౌనె యనక
త్ర్యంబకుం డితఁ డనేకాంబకుల్ దేవతారిపు లెట్టువారి నిర్జించు ననక

తే. యన సుకేశకుమారసంహారమునకు
నెట్టు లోడఁబడు నితఁ డనకింద్రముఖ్యు
లటుల రూపన్నులై భద్రవటమునీడ
నిండుకొలువున్న పార్వతీనేతఁ గనిరి. 255

క. కనివినయముభయమును బెనఁ, గొనఁ నగములు మొగిచిశివునకును బహుసాష్టాం
గనమస్కృతు లొనరిచి యిట్లని పొగడిరి మునుఁ గూడి కామరేంద్రముఖుల్,

మత్తేభగర్భితసీసము—

అభవకందర్పమదాపహాసలద్యశా పద్మాకోటిప్రభా జోహారు
సుకవిసంస్తుత్యా రజోగుణేతరమతీగౌరీపఘనానాయకా జోహారు
ప్రభవకుంభీంద్రవిభంజనక్రమహా బ్రహ్మాది దేవాధిపా జోహారు
త్రిభువనాధీశ్వర దేవసంయమిమనఃపూజావిధేయాత్మకా జోహారు

తే. చంద్రశకలశిరోవతంసక జోహారు, సుగధరాధరకోదండధర జోహారు
శరధికన్యామనోహరశర జోహారు, ప్రణతరక్షావిచక్షణేక్షణ జోహారు. 257

చ. రతిపతివైరి శంకర పరాకు సుకేశసురారినందన
త్రితయముచేతిబాధ నతిదీనుల మై గతిమాలి లోకసం
తతులకు దిక్కు నీ వగుటఁ దావక పాదము లాశ్రయింప వ
చ్చితిమి దయాప్రసక్తి మముఁ జేకొని విన్నప మాదరింపవే. 258

ఉ. కాలిచి రాశ్రమావళులఁ గార్ముకముక్తశరాగ్నికీలలం
బ్రేలిచి రెల్ల దేవతల భీరులఁ జేసిరి సిద్ధముఖ్యులం
దాలిచి రుగ్రరూపములు దైవగృహాంతర గోపురాములన్
గూలిచి రేమి దెల్పెదము క్రూరసురారులచెయ్వులీశ్వరా. 259

సీ. పద్మాసనస్థులై ప్రణవంబు నొడువుచు ముక్కుఁ బట్టఁగ బాసె మునివరులకు
నేపట్లనైన స్వాహాపూర్వముగ హవ్య మగ్ని వేల్వఁగఁ బాసె యజ్వలకును
హవిరన్న కాంక్ష నేసవనకర్త గృహంబు దేటి చూడఁగఁ బాసె దేవతలకు
గుహలలో నొంటిగాఁ గూర్చుండి నీపాదచింత సేయఁగఁ బాపె సిద్ధులకును

తే. జేరి గురుకులవాసంబుఁ జేసి శ్రుతులఁ, జదువుకొనఁ బాసె నీబ్రహ్మచారులకును
బార్వతీనాథ మాల్యవత్ప్రముఖదైత్య, శేఖరులు సేయునాజ్ఞావిశేషమునను.

ఉ. ఏమె యజాచ్యుతేశ్వరుల మేమె దినేశహుతాశనక్షపా
కాముల మేమె యింద్రయమకంధివరేణ్యుల మంచు భీమసం
గ్రామకుతూహలంబున జగత్త్రయమున్ బడలించురాక్షస
గ్రామణులన్ హరించి మముఁ గావఁగదే శివ యంచు మ్రొక్కినన్. 261

శా. ఆముక్కంటి దరస్మితంబున సుపర్వాధీశులన్ జూచి మీ
తో మోమోటము లేక తెల్పెద నవధ్యుల్ రాక్షసుల్ వారలన్
నే మర్దింపఁగ నోప వారి గెడపన్ ముకుందుండు మీ
రీమంత్రం బెద నమ్మి శౌరిఁ గనఁ బొం డిష్టార్థముల్ సేకుఱున్. 262

క. దితిజాహితుచేఁ దక్కఁగ, నితరులచేఁ జెడరు వార లిది నిజ మని య
య్యతనుహరుం డాడిన నా,శ్రితహిత మొనరింప మీకె చెల్లు నటంచున్. 263

## ఇంద్రాదులు విష్ణునియొద్దకుం బోవుట

శా. ఆకైలాసనివాసు వీడుకొని కార్యైకాతురత్వంబునన్
నాకార్యాదులు వోయి బాడబశిఖిప్రజ్వాలికాసంగతిన్
బైకిన్ బొంగుచు ఫేనమాలికలతో బల్ మ్రోఁతయున్ గన్నశ్రీ
రాకూపారముఁ జేరి తజ్జలధిమధ్యద్వీపదేశంబునన్, 264

సీ. కడలిరాయఁడు మిన్న గలమిన్న గమిడాఁప ఘటియించు బంగారుకణఁజ మనఁగ
జలధిమధ్యమునందు జనియించినసహస్రపత్త్రశోభితహైమపద్మ మనఁగఁ
దెలిసీవిపుడమిముద్దులగుమ్మ నిజవలగ్నమునఁ బూనుసువర్ణఘంట యనఁగఁ
బాథోధిసుతవీడుపట్టుచొక్కపుడాఁరంపుహారాంబట్టు సరాతి యనఁగ

తే. వలుపు మీఱినవైకుంఠనగరిపసిమి
కోటఁ బొడగాంచి మ్రొక్కుచు గోపురంబు
దఱియఁ జొచ్చి మహోన్నతగరుడకేతు
రాజి నలరాజుహరిహజారంబుఁ జేరి. 265

చ. తెలిమగఱాతికంబములఁ దీఱినబంగరుకీలుబొమ్మగుం
పులకు మెఱుంగుఁగొప్పుసాలపుల్ మొలపించెడు కప్పురాలలో
పలఁ గలకల్వచప్పరపువన్నెలఁ జెప్పగునొక్కమేడలో
నలరుచు నేకతంబ కొలు వైనహరిన్ విని రాదిశాధిపుల్. 266

క. విని సమయ మహానో కాదో, యని యించుక నిలిచి యచట నవసరపుఁజెలిన్
గని స్వామికి మాయాగతి, వినిపింపం దగు నటంచు వేఁడిన నదియున్. 267

సీ. తిలకంబు దిద్ది దిద్దితిఁ జూడు మనురమాసుదతిచెక్కుల నీడఁ జూచువాని
మొనపంటమడుపు వేఁడినసీళ యొసఁగనందుచుఁ జఱుక్కని మోవినొక్కువానిఁ
ఒనచిన్నెలకును జక్కని మొగం బటు వెట్టుకొనినభూపతి వేఁడుకొనెడువాని
వారియింతులకు మున్ వాదు తానె ఘటించి నలిరేగి పోరాడ నవ్వువాని

తే. నిచ్చఁ బరిపూర్ణకాముఁడై హెచ్చువాని
నచ్యుతునిఁ గాంచి మ్రొక్కి యింద్రాదిసురలు
దేవ యరుదెంచినా రంచు దెలిపినంత
శీఘ్రమునఁ దోడితెమ్మని సెల వొసంగ. 268

క. ఆవిశ్వంభరు ననుమతి, దౌవారిక లెఱిఁగి పనుపఁ దత్పరమతులై
దేవతలు సన్నిధికిఁ జని, సేవించిరి శుక్రశిష్యజిష్ణున్ విష్ణున్. 269

వ. ఈ చందంబున శంఖచక్రగదాశార్ఙ్గనందకధరుండును భక్తజనానందకరుండును
నగు నద్దయాకరునకు నభివందనంబు లొనర్చి బృందారకు లిట్లని యభినందించిరి.

—— దేవతలు మాల్యవదాదిరాక్షసోపద్రవమును విష్ణుదేవునకు విన్నవించుట ——

సీ. దండంబు శార్ఙ్గకోదండోగ్రకాండప్రకాండఖండితదైత్యకాండ నీకు
జోహారు మదగజద్రోహిగ్రహావహగ్రాహచ్ఛిదాహాదోత్సాహ నీకు
వందనం బరవిందమందిరామందిరత్పుందరకోరస్థలాళింద నీకు
జేజే మహారాజాదిరాజీవపూజాసమాజోచితాంఘ్రిపంకేజ నీకు
తే. బహునమస్కారములు చక్రపాణి నీకు, నైకసాష్టాంగములు జగన్నాథ నీకుఁ
బ్రణతిశతములు సురసార్వభౌమ నీక, నంతసేవాంజలులు సదానంద నీకు. 271

ఉ. దానవవీరవైరి యవధారు సుకేశతనూభవుల్ మహో
గ్రానలదీప్తవిగ్రహు లుదగ్రులు మువ్వురుఁ గూడి లోకసం
తానము గాసిచేసెదరు తద్వ్యథ లోరువ లేక మిక్కిలిన్
దీనతఁ జెంది యిం దరుగుదెంచితి మాపదఁ బాపవే కృపన్. 272

సీ. ఖపురభేదియు నంతకచ్ఛేదియన మించుహరుభుజాదైభవం బనఁగ నెంత
దరముతో జడవృత్తిఁ దాల్చి యయూపుఁ డౌ శార్ఙ్గకోదండుని సత్త్వ మెంత
చోరుచేనపహృతశ్రుతియై యజాఖ్యు కాస్పదమైనవేల్పురాజస మదెంత
పాకాపహృతియు జంభవిఘాత మొనరించి యలరువృద్ధశ్రవుబలిమి యెంత
తే. యితరసుమనోగణములయహీనసమర, కర్కశత్వ మదెంతవి గణుతిసేయ
రసురముఖ్యులు తామె బ్రహ్మోదిదేవ, వరుల నందఱ మించినవార మనుచు. 273

సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన దివిజారివరుల కాయువులు నిండు
బలురయంబున నీవు బాణముల్ వఱపిన విమతసైనికులప్రాణములు వఱచుఁ
గడిమిమై నీవు చక్రముఁ గేల నంటిన రాక్షసగుప్తచక్రము గలంగు
నలిరేఁగి పాంచజన్యము నీవు పూరింప నహితజన్యములు జన్యములు మాను
తే. గరుడవాహన మెక్కి లోకములు పొగడ, నందకము బూని కలనికి నడచితేనిఁ
గొంచ జెవ్వాఁడు నిన్నెదిరించువాఁడు, తామసము సేయ నేల రావే ముకుంద.

—— విష్ణువు సురల కభయం బొసంగుట ——

వ అని యాపన్నులయి విన్నవించిన వేల్పుమన్నెదొరలయెడల బ్రసన్నుండయి
వెన్నుండిట్లని యానతిచ్చె. 275

చ ఎఱుఁగుదు మున్ను సుకేశుఁడు మహేశుకృపన్ విభవాభిరాముఁ డౌ
టెఱుఁగుదు వానిపుత్త్రకు లహీనవరంబులు బ్రహ్మ యీయఁగా
మెఱసి జగత్త్రయంబునకు మీకును బాధకులౌట సర్వ మే
నెఱుఁగుదు వేల్పులార వెత నింకకుఁ డింక జయింతు వారలన్. 276

శా. పూర్వాదిత్యమహావిలాసము లయంబున్ జెంద నస్మద్ధను
ర్జ్యాస్ఫోటంకృతిగర్జ హెచ్చ సుమనోగ్లానిత్వముల్ మాన మ

ద్దుర్వారాశుగవృష్టి ముంచి యిటఁ దద్దుష్టవ్యమగ్రిమ్మతి
ప్రార్థ్యేతాపముఁ బాపు నేఁగుఁ డన వారుత్సాహముం బొందుచున్. 277

తే. ఇందిరానాథవదనారవిందగళిత, మందమధురవచోమకరందబిందు
బృందతుందిలసుమనోమిళిందు లై పు,రందరాదులు సెందిరి మందిరముల. 278

క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని రాఘవుఁ డవల నెట్టివృత్తి మెలఁగి ర
ద్దనుజులు హరి వారలతో, నని యెటువలెఁ జేసెఁ దెల్పుఁ డని యడుగుటయున్.

ఆశ్వాసాంతము

శా. హేలాగోపితగోపికాంశుక శుకశ్రీతాపయోధిస్ఫుర
త్ప్రాలేయాంశుయశోధురంధర ధరప్రత్యర్థిముక్తాంబుదా
భీలప్రస్తరవర్ష వారణ రణస్ఫీతామృతాంధోద్విష
జ్జాలవ్యాళభిదాఖగోత్తమ తమస్సంభేది తేజోనిధీ. 280

క. యతికువలయహిమకర కర, భృతనందక చక్రచక్ర హితఘృణిమణిభా
సితవత్స వత్సదనుజా, యతమారుతభుజగ జగదుదంచితనియతీ. 281

భుజంగప్రయాతము—

విశాంతస్ఫురత్పాండుసీరేజనేత్రా. నిశాంతజ్జగద్వందనీయాబ్జమిత్రా
యశోదానదాక్షిణ్యహారిత్వధుర్యా, యశోదామనోరంజకాశ్చర్యచర్యా 282

గద్యము. ఇది శ్రీమదనగోపాల కృపాలలితకటాక్షవీక్షాసమాసాదితచతుర్విధాన
పద్య కవిత్వవిద్యావధానాధునాతన భోజరాజ సకలవిద్వజ్జనాభివర్ణితోదీర
వితీర్ణివైభవాధఃకృతరాజరాజ రాజయోగసామ్రాజ్య లక్ష్మీవిలాస ధురంధర
ధరాధిప సభాంతరస్తవనీయ నయకళాయుగంధర బంధురమనిషావిశేష మంథాన
వసుంధరాధర శోభితాగణిత గణితశాస్త్రరత్నాకర వినయాదికగుణరత్నాకర
కంకంటివంశపయఃపారావార పరిపూర్ణసుధాకరాప్పయామాత్య సుక్రందన
నందన విజ్ఞానవిభవ విజితసనందన విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన
నిర్మాణప్రవీణతానిధాన పాపరాజప్రధాన ప్రణీతం బైన శ్రీమదుత్తరరామా
యణం బను మహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీమదుత్తరరామాయణము



## తీయాశ్వాసము

శ్రీ రాధామధురసుధా
ధారాధరలోల కామితప్రదశీలా
శారీరశ్రీజితనవ
ధారాధరజాల శ్రీమదనగోపాలా. 1

తే. అవధరింపుము కుంభసంభవమహర్షి, చంద్రుఁ డిట్లను శ్రీరామచంద్రుఁ జూచి
జానకీనాథ సుర లిట్లు శార్ఙ్గిచేత, నభయదానంబుఁ గొని వేడ్క నరిగి రంత. 2

### మాల్యవంతుఁడు విష్ణుప్రభావమును దమ్ములకుఁ దెల్పుట

శా. ఆవృత్తాంతము వేగరుల్ దెలుపఁగా నాలించి యమ్మాల్యవ
ద్దేవద్వేషి నిజానుజద్వయము నెంతేఁ గూర్మి రప్పించి మం
త్రావాసంబున నుండి యి ట్లనియె నేకాంతంబుగా శేముషీ
ప్రావీణ్యంబును గార్యతత్పరత సౌభ్రాత్రంబుఁ గాన్పింపఁగన్, 3

ఉ. వింటిరె తమ్ములార యొకవింత వినంబడె మొన్న నేము ము
క్కంటిఁ గనంగ నెల్ల తెఱఁగంటిదొరల్ మును లేఁగి మ్రొక్కి మీ
బంటుల మమ్ము నొంచెదరు బాధలఁ బెట్టి సుకేశపుత్త్రు ల
క్కంటకులన్ వధించి మముఁ గావఁ గదే శివ యంచు వేఁడినన్, 4

చ. కరచలనంబు మస్తకవికంపనముం గవిపింప వారితో
హరుఁ డపు డానతిచ్చెనఁట యాయసురేంద్రులు మాకజయ్యు లా
హరి యగునే జయించుఁ జనుఁ డాయనయొద్ద కటంచు నట్ల సు
స్థిరమతి వార లేఁగి రట శీఘ్రముగా నసురారియొద్దకున్, 5

చ. హరునకుఁ దెల్పినట్ల మనయాగడముల్ హరితోడఁ దెల్ప నా
హరి వెత నేల శాత్రవచయంబు వధించెదఁ గొంచ కింక మీ

యిరవుల నుండుఁ డంక భయ మిచ్చి ప్రియంబున వీడుకొల్పఁగా
నరుసముఁ జెంది వచ్చిరఁట యందఱు ముందటిలీల గుంపులై. 6

చ. అమరులపాలివాఁడు హరి మాయన యిచ్చినబాస దప్పఁ డే
క్రమమున నైన గెల్చు మనగర్వము లింతకుఁ దెచ్చె నెఘ్ఘన
క్రమమె యొనర్తు మేబలులఁ గైకొన మెంతటివారి నాదరిం
పము బలవద్విరోధము శుభం బొనగించునె యెంతవారికిన్. 7

క. హీనునితోఁ దగు రణము స,మానునితోఁ జేయఁ దగు సమాధానము సం
ధానరణంబులు దగ వస,మానునితోఁ దొలఁగి కొలిచి మనుటయె యొప్పున్. 8

మ. నడుమంత్రంబున బల్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డె
క్కుడువారిన్ దొడరంగఁ బోయి మఱియున్ ఘోరానలజ్వాలలోఁ
బడి నీఱౌ శలభంబులీల సహజశ్రీజిష్ణుశౌర్యుండు ని
ల్కడ భావంబున నుండుఁ గయ్యమునకున్ గాల్ద్రివ్వఁ డేపట్టునన్. 9

క. తనబలము నెదిరిబలమును, గనుఁగొనక హితోపదేశకర్తలపలుకున్
వినక కుజనుండుఁ సాహస,మునఁ జెడు బలుగాడ్పు దొడరు బూరుగులీలన్. 10

ఉ. కావున దేవతార్థముగఁ గయ్యము సేయఁగ వచ్చువిష్ణుపైఁ
బోవుట పాడి గాదతఁడు పుణ్యజనప్రియుఁ డాశ్రయించినన్
గానక పోవఁ డిప్పు డవకార్యము కయ్యము నెయ్య మొప్పు స
ద్భావముతో ముకుందునకె భక్తులమైన నసాధ్య మున్నదే. 11

క. రాక్షసులు సేరినను హరి, రక్షించునె యనఁగ వలదు ప్రహ్లాదాదుల్
రాక్షసులు గారొ వారల, రక్షింపఁడొ మీ రెఱుంగరా హరిమహిమల్. 12

సీ. ప్రళయాబ్ధి నోఁకాలిబంటిగాఁ జరియించుమధుకైటభులఁ బట్టి మట్టువెట్టెఁ
జాఁపచుట్టుగ ధరాచక్రంబుఁ జుట్టి కొంపోవుహిరణ్యాక్షుఁ బొడవడంచెఁ
ద్రైలోక్యనాథుఁడై తన కీడుజోడును గాంచ నున్నహిరణ్యకశిపుఁ ద్రుంచె
జదువులదొంగయై జలరాశి డాఁగిన కపటిహయగ్రీవు కడిమిఁ జెఱిచె

తే. నముచి వధియించె సంహ్రాదనాము నొంచె, గెలిచె శుంభనిశుంభుల నలసహస్ర
కవచుఁ దెగటార్చెఁ బరిమార్చెఁ గాలనేమిఁ, దరమె విష్ణునితోఁ బోరఁ దమ్ములార.

ఉ. వారలకంటె నెక్కుడగువారమె విష్ణునితోడఁ బోర ని
ష్కారణ మల్గఁ డాయన నిజంబుగ నేరము లేక శౌరియం
దారయ దోస మేమి మనయంరభదోసమె తన్మనోంబుజం
బీరస మొందఁ జేసె నిది యెంచి యొనర్పఁడు మీఁదికార్యముల్. 14

తే. అని హితం బెఱిఁగించినయన్నమాట, నాసుమాలియు మాలియు నాలకించి
నీతిఁ దెలిపియుఁ దెలియక నీతి మాలి, యుద్ధమును గూడి యతనితో నిట్టులనిరి.

శా. ఇష్టైశ్వర్యయుతంబు నీనెలవు నీయిచ్ఛాధృశం బాయు వు
త్కృష్టప్రాభవశాలి వంచితతపోధిక్యంబు నీసామ్ము నీ

శిష్టాచారము మేలుబంతి పలలాశిశ్రేణికిన్ శాత్రవా
శిష్టోత్సాహనిధాన నీవుఁ దగునే నేఁ డింత చింతింపఁగన్. 16

మ. విశిఖోత్తుంగతరంగఘుంఘుమరవోద్వేలంబు దుర్వారవీ
రశతాంబూద్భటసంకులంబు సముద్రచ్ఛత్ర ఫేనావృతం
బు శతాంగాద్రియుతంబు వాసురబలాంభోరాశి నీబాడబో
గ్రశరజ్వాలల నింకె; నెవ్వ రెదు రింకన్ నీకు దైత్యాగ్రణీ. 17

మ. బలవంతుల్ భవదీయపుత్రకులు నీభ్రాతల్ త్రిలోకైకవీ
రులు నిన్ మృత్యువు దేఱి చూడ వెఱచున్ రుద్రాచ్యుతాంభోజగ
ర్భులు నీపే రవినన్ దలంకుదురు భీరుత్వంబు నీ కేల నిన్
దెలియన్ జాలక యానతిచ్చెదవు దైతేయాన్వయగ్రామణీ 18

తే. అస్మదాదులు సేయు రాయిడి సుపర్వు
లచ్యుతునితోడఁ దెలిపిరా రనియె భయముఁ
జెందెదవుగాని మనలను జెఱుప నింత
కెత్తుకొని రని యలుగ వదేమి యధిపఁ. 19

మ. అరులన్ జంపు మటంచుఁ బంద లయి యయ్యాదిత్యు లార్తిన్ గణిం
చిరి పో సర్వసమానుఁ డైనహరి ద్వేషిత్వంబుఁ దాఁ బూని యే
కరణిన్ గయ్యము సేయ వచ్చు మవతోఁ గార్యంబుఁ గాటిల్య మా
హరికిన్ గల్గిన మాదృశుం డతఁడు గాకాధిక్య మే మారయన్. 20

తే. సహజమాత్సర్యమున దేవసమితితోడ, మనము దొడరిన హరియేల మచ్చరించు
నతఁడె నిష్కారణద్వేషి యయ్యె నేని, సంధికార్యంబు వొసఁగునే సరసగతిని.

తే. వనజనాభుండు గనుపించుకొను నటంచు
వెఱచి పగతురపైఁ గినుక విడువవలెనె
యేటియోజన బలవంతుఁ డీహరి యని
యిపుడు శరణన్న నవ్వరే యెవ్వరైన. 22

తే. వెన్నునకు నస్మదాదుల మెన్నఁడైన, నపకృతి యొనర్ప మతఁడెన్నఁడైన మనకు
జీయఁ డవకృతి వేల్పులు సేసి రింత, వేలుపులమీఁద నీక దండు వెడలవలయు.

చ. త్రిదశులతోడఁ గయ్య మొనరించి రమాపతి యస్మదాదులన్
గదిసి రణం బొనర్చినను గాదన వచ్చునె యంతభాగ్యము
న్నదె యెటులైన మంచిది రణం బొనరింతము నేదశాస్త్రముల్
సదివితి మీవు లిచ్చితిమి జన్నము లూనితి మైహికంబునన్. 24

తే. అన్న నీమాట జవదాఁటి యాడితి మని
యలుక సేయక ప్రతివాదములు క్షమించి
యనుమతి యొసంగు మిపుడె మదాంధు లనుసు
ధాంధుల జయించి వచ్చెద మనుచుఁ బలికి 25

## మాల్యవంతుఁడు మొదలగురాక్షసు లింద్రునిపై దండెత్తుట

క. సేనాధిపతుల రమ్మని, దానవపతి యమరరాజధానిపయిఁ జనన్
బూనినవాఁ డిప్పుడె మన, సేనల రప్పింపుఁ డనుచుఁ దనుచు సెలవిచ్చుటయున్

భుజంగప్రయాతము.—

దళాపెద్దయాజ్ఞన్ సుధాభుగ్విరోధ్యగ్రణీసేనలన్ మించె గంభీరభేరీ
ధణంధాణముల్ దేవధానీవనద్గర్భిణీగర్భభ్రూణభేదంబు గాఁగన్. 27

సీ. తననిర్ఝరాచలత్వమున కుల్కి సురాద్రి వాపోవుగతిఁ బ్రతిధ్వని లొసంగఁ
దన కింక నెద్ది జీవన మంచు వారాశి కలఁగె నా జలము పంకిలము గాఁగ
దనమేను గరుపారఁ దమి మీఱి శశిధారి వడఁకుగుబ్బలికన్నెవడకుఁ దీర్పఁ
దనకోర్కె లీడేఱె నను చొక్కపరువుతోఁ గలహాభోజి ముకుందుకడకుఁ బఱవఁ
తే. జెవులలో వ్రేళు లునిచి రాజీవగర్భుఁ
డిచ్చ నేమియు ననలేక యచ్చపడఁగ
మించి ప్రస్థానభేరి వేయించి దండు
వెడలి రసురులు జేజేలవీటిమీఁద. 28

సీ. సౌందర్యకృత మేరుమందరాచలనిందనము లౌ మహాస్యందనములమీఁద
భూరిదానోదకాపూర్ణ బంధురకంధరము లైన మదసింధురములమీఁద
స్వజవమానసగంధవాహవాహసబాంధవము లైన ఘనసైంధవములమీఁద
బ్రతిపక్షకుంభికుంభచ్ఛిదారంభరంహము లైన ఘోరసింహములమీఁద
తే. శరభచమరీమృగవ్యాఘ్రశల్యభల్ల, కాసరవరాహఖడ్గపుంగవఖరోష్ట్ర
విహగఫణికూర్మమకరాది వివిధవాహ, వారములమీఁద దైతేయవీరు లెక్కి

సీ. మధ్యందినాదిత్యమండలోగ్రాంశుపాణింధమాయుధదీప్తి నింగి మ్రగ్గఁగ
గాఢసర్వాంగీణకవచవజ్రచ్ఛటాచ్ఛాయ లాశాకుడ్యచయమ్ము లొసంగ
వీరపాణప్రక్రియారక్తదృగ్దృశ్యవిభఖదిరాంగారవృష్టి గురియఁ
బ్రళయకాలాభ్రగర్జావదావదనిష్ఠురాట్టహాసముల బ్రహ్మాండ మగల
తే. దేవలోకజిగీష చేఁ ద్రిపురహంతృ, కామకామాంతకోద్భటాకారు లగుచు
లంక విడిచి మనోవీథి శంక విడిచి, యసురు లుత్సాహము గ్రాల నరుగువేళ.

శా. ఆలంకాపురిలో వినంబడె సృగాలారావముల్ భూతవే
తాళక్రూరతరాట్టహాసములు మిథ్యాదుర్విలాపంబు ల
వ్వేళన్ వేలయు దాఁటి నద్రిసలఁ బర్వెన్ సాగరోల్లోలక
ల్లోలశ్రేణి చలించె క్షోణి నుడుపాళుల్ రాలె వ్రీలెన్ గిరుల్. 31

శా. రక్షస్సైన్యములోఁ గబంధములు గృధ్రంబుల్ నటించెన్ ద్రిలో
కక్షోభగంబుగ మేఘముల్ గురిసె నిర్ఘాతాస్థిమాంసాస్రముల్
పక్షక్షేపము లొప్ప నిప్పుకలు గూబల్ చూపులన్ రాల్చెఁ బ
ద్మాక్షుం డిప్పుడె మిమ్ము గెల్చు ననుప ల్కాకాశభూతం బనెన్. 32

శా. పేర్చెన్ సూరెల నశ్వినీసుతులు రాఁ బెం పొందునింద్రున్ బలెన్
భ్రాతల్ గొల్వఁగ మాల్యవంతుఁ డపు డాభౌమాంతరిక్షో దితో
త్పాతంబుల్ దిలకించి దైవకృతముల్ దప్పింప రా దంచు ని
ర్భీతిన్ సైన్యముఖంబునన్ నడచె నీరేజాక్షవిద్విట్ప్రభున్. 33

ఉ. మాల్యవదాసురుం డిటుల మాల్యవదాఖ్యనగంబులీల నై
శ్చల్యముతో ననేకదివిషద్రిపుసంగతుఁడై పటీరనై
ర్మల్యలసద్యశోధనసమన్వితదాత ధనార్థికోటిలోఁ
గల్పతఁ గన్యకై వడిఁ బ్రకాశిలె శత్రులు భీతి నొందఁగన్. 34

ఆ. విభునిశౌర్యధైర్యవిక్రమోన్నతిసాహ, వములు సూచి సకలసైనికులును
భయము మాలి మాలిపనుపున మృత్యువ, శాత్ములగుచు నడచి రమరపురికి. 35

చ. దనుజవరూథినీసలలితత్వరితాశ్వఖురాహతోర్వరా
జనితపరాగ మింద్రపుఁ జక్కటికిన్ జను టొప్పె మీఁపురం
బున కదె దాడిగా దనుజముఖ్యులు వచ్చెద రేడ కైనఁ బొం
డని మునుమున్నె ధాత్రియమరాళికిఁ దెల్పఁగ నేఁగెనో యనన్. 36

మ. సురదంతావళిదానగంధలహరిన్ సొంపొందుసౌరాపగాం
బురుహాళిఁ దమిళిందబృందము మహామోదంబునన్ బైకొనన్
జరనీలాచలభాసురాసురబలస్తంబేరమోద్యత్కటాం
తరచంచస్మర మాహరింప రిపు లన్నన్ సైప రెవ్వారలున్. 37

ఉ. భ్రాతలవీటి కీగ్గతి నుపాధి విరోధు లొనర్పఁ జూడఁ బా
డైతి నటంచు విన్ననయినట్టిక్రమంబునఁ గాంతి మాసి సిఖ
ద్యోతుఁడు వీరరాత్రిసభటోద్భటపాణికృపాణదీధితి
వ్రాతము గప్పినన్ గనె వివర్ణత యద్దపుబిల్లకై వడిన్ 38

వ. తత్సమయంబున. 39

విష్ణువు దేవసాహాయ్యార్థము వచ్చి మాల్యవదాదులతో సమరం బొనర్చుట

ఉ. ఆసురరాడ్భయానక జయానక నాదము లాఁకించెనో
వాసవదూత వోయి యిదె వచ్చిరి దైత్యులు నా నెఱింగెనో
తా సకలాత్ముఁ డౌట విభుతన్ గనెనో తెలియంగ రాదు ల
క్ష్మీసరసోక్తులన్ దనివిఁ జెంది ముకుందుఁడు లేచెఁ జెచ్చెరన్. 40

వ. ఈప్రకారంబున క్షీరాబ్ధికుమారితోడి విహారంబు చాలించి దనుజసంహారంబు నందు
డెందంబుఁ గీలించి సురబృందంబు మే లెంచి మహోత్సాహంబున. 41

సీ. వనజమోహామునఁ జేరిన భాస్కరుఁడో నాఁగ శయకుశేశయమునఁ జక్రమమర
గరికరంబున సితాంబురుహంబు దగులీల నొక కేలనంబుజం బొప్పు మీఱ

నంజనాచలముపై నరుణాతపము మించు రహి మేనఁ గనకాంబరము దనర్పఁ
దాలువేల్పు రాప్రతిమలచెక్కడపుగండ పెండెంబు డాకాల దండిఁ జూప
తే. శార్ఙ్గతూణగదాఖడ్గసహితమహిత

గరుడస్కంధ మెక్కి బంగరపుగట్టు
తుదను గనుపట్టునీలతోయద మనంగ
శాత్రవజిగీష నరుదెంచెఁ జక్రధరుఁడు. 42
వ. తత్సమయంబున. 43
సీ. తూలఖండములట్లు తుమక లై పాథోధరములు గోదోంతరాళమున నెఱసె
సపత్త్రములలీల శైలముల్ దివిఁ బ్రతిధ్వనులతో నొండొంటిఁ దాఁకులాడె
శరనిధుల్ లోఁతుసూప రసాతలము దోఁపఁ జిలువరాచెలులకంపెలుచలించెఁ
గులశైలచలనంబువలన భారము మోవ జెంది దిక్కరులు గీపెట్టసాగె
తే. విఱిగి పెళ పెళ ధరఁగూలె విపినతరులు గ్రహవిభుని తేరిహరులపగ్గములువదలెఁ
బ్రళయఝంఝానిలాభీలపక్షిరాజ, పక్షవిక్షేపజాతప్రభంజనమున. 44
క. పక్షీంద్రపక్షహతదీ, ప్రక్షోణీరేణుపటలి ప్రతిపక్షచమూ
రక్షోవీక్షల కప్ర,త్యక్షము గావించె భువన మంతయు నధిపా. 45
చ. హరిశరపంక్తికంటె మును పగ్గరుడోగ్రగరున్మరుత్పరం
పరలు విరోధిసైన్యములపైఁ జనఁ గూలె ధ్వజాతపత్త్రచా
మరసుభటప్రకాండభుజమండలమండితమండలాగ్రముల్
కరులు హరుల్ రథంబులును గాడ్పడెఁ జేడ్పడి రెల్లసైనికుల్, 46
చ. అమరులు పుష్పవృష్టి గురియన్ దివిఁ దుంబురునారదాదిగా
నములు రహింప సేవకజనంబులు గొల్వఁగఁ జారణస్తుతుల్
ప్రమద మొనర్ప వచ్చి రిపుభంజనుఁ డాహరి యొత్తె రుక్మమా
హమధితరాజమున్ రవధుతారిసమాజము శంఖరాజమున్. 47
చ. అదిరి కడున్ సురారిభటు లాజయశంఖరవంబు వీనులన్
గతిసిన గుండియల్ వగులఁ గంపముతోఁ దల లెత్తి కాంచన
చ్ఛదరుచి మించునగ్గరుడుఁ జక్కఁ గనుంగొన లేక భీతు లై
యదె యిదె వాఁడె వీఁడె హరి యంచుఁ జలింపఁగ సైనికాగ్రణుల్. 48
ఉ. గర్వముతో సుపర్వులకుఁ గా నని సేయఁగ వచ్చితే యిదే
సర్వసమానలక్షణము సాలు హరీ నిలు పోకు మం చహం
పూర్వికతో గదాపరశుముద్గరతోమరపాణు లై మహా
పర్వతరాజమున్ మశకపంక్తులయ ట్లెదిరించి రొక్కటన్. 49
సీ. వర్షాబ్దగతి నంపవానదైత్యులు ముంప నచలుఁడై హరి యంజనాద్రిఁ దెగడె
శలభసంహతిలీల శత్త్రు లొక్కట మీఱఁ గేదారగతి నొందెఁ గేశవుండు

